




ఈ గ్రంథ ప్రచురణకు తమ అమూల్య సహాయ సహకారాలందించిన
సహృదయులు శ్రీ డి సుబ్బారావు, (జాయింట్ మేనేజింగ్ డైరక్టర్,
కోస్టల్ పేపర్ మిల్స్ లిమిటెడ్) ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలనీ,
సర్వతోముఖ ప్రగతి సాధించాలనీ ఆకాంక్షిస్తున్నాం.

**ఆనంద బుద్ధ విహార ట్రస్ట్**

సాయినగర్ : తుకారాంగేట్, నార్త్ లాలాగూడ,
సికింద్రాబాద్ - 500 017 ఎ.పి., ఇండియా.
ఫోన్ : 0091-40-7732421, ఫ్యాక్స్ : 0091-40-842477
(బిఎఫ్‌యంబి-298. 7732421)

రెండవ ప్రచురణ

**ఆనంద బుద్ధ విహార ట్రస్ట్**

2000 : కాపీలు

2541 బుద్ధ జయంతి - 1997

This monograph draws on the works of *Sir Charles Eliot*, *Ananda K. Coomaraswamy*, *Ven. Narada Mahathera*, *Ven. Piyadassi Thera*

*Cover Page designed by Apple Advertising Pvt. Ltd., Hyderabad.*

*Type set and printed by Master Graphics Pvt. Ltd., Hyderabad.*






**ఆనంద బుద్ధ విహార ట్రస్ట్**
సాయినగర్, తుకారాంగేట్, సికింద్రాబాదు

## సందేశం

ఆనంద బుద్ధ విహార ట్రస్టు బౌద్ధ సాంప్రదాయ, సంస్కృతి పునరుద్ధరణకు, పరిరక్షణకు అంకితమైన సంస్థ. ఈ సంస్థ బౌద్ధ సాహిత్యాన్ని తెలుగులోను, ఇంగ్లీషులోను ప్రచురించే కార్యక్రమాన్ని చేపట్టింది. ఈ కార్యక్రమంలో భాగంగా ప్రతి సంవత్సరం బుద్ధ జయంతికి కనీసం ఒక క్రొత్త ప్రచురణకై ట్రస్టు సంకల్పించింది. ఈ కృషిలో భాగంగా 'సిద్ధార్థ గౌతమ' అనే ఈ చిన్న పుస్తకాన్ని తెలుగు, ఇంగ్లీషులలో ఈ సంవత్సరం ప్రచురించడమైంది. 'సిద్ధార్థ గౌతమ' ను సంకలనం చేసి పుస్తక రూపంలో ప్రచురించడానికి మా సంస్థ ఉపాధ్యక్షులు శ్రీ చెన్నూరు ఆంజనేయ రెడ్డి కృషి చేసారు. దీనిని శ్రీ గజ్జెల అశోక్‌రెడ్డి తెలుగులోకి అనువదించారు.

బుద్ధుని గురించి ఒక పండితుడిలా అన్నారు :

***"బుద్ధుని అభిమానించే కొలదీ తెలిసికోగలం.***
***తెలిసిన కొలదీ అభిమానించగలం".***

సిద్ధార్థ గౌతముని జీవితాన్ని ప్రతిబింబించే ఈ చిన్న పుస్తకం బుద్ధుని పట్ల, బౌద్ధ ధర్మం పట్ల పాఠకులలో ఆసక్తి రేకెత్తించగలదని ఆశిస్తున్నాను.

సంఘరక్షిత మహాథేర

2541వ బుద్ధజయంతి
22 మే, 1997
హైదరాబాదు.

**సంఘరక్షిత మహాతేర**
**అధ్యక్షులు**

# పంచశీల

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

దుతియాం పి బుద్ధం శరణం గచ్ఛామి
దుతియాం పి ధర్మం శరణం గచ్ఛామి
దుతియాం పి సంఘం శరణం గచ్ఛామి

తతియాం పి బుద్ధం శరణం గచ్ఛామి
తతియాం పి ధర్మం శరణం గచ్ఛామి
తతియాం పి సంఘం శరణం గచ్ఛామి

పానాతిపాత వెరమణి సిక్కాపదం సమాదియామి
అదిన్నా దానా వెరమణి సిక్కాపదం సమాదియామి
కామేశు మిచ్ఛాచారా వెరమణి సిక్కాపదం సమాదియామి
ముసావాదా వెరమణి సిక్కాపదం సమాదియామి
సురామెరయ మజ్జపమా దత్తానా వెరమణి సిక్కాపదం
సమాదియామి

# సిద్ధార్థ గౌతమ

ప్రాచీన భారతీయులకు చారిత్రక దృష్టి తక్కువనే చెప్పాలి. ఆనాటిమేటి రచయితలకూ, సాహిత్యకారులకూ సమకాలీన ప్రముఖుల జీవిత విశేషాలను భావితరాలకు అందించాలన్న ఉద్దేశ్యమున్నట్లు అగుపించదు. వేదఋషుల విశ్వాసాలనూ, వారుసాగించిన ఆధ్యాత్మిక సాదనలను, నిర్వహించిన యజ్ఞ యాగాదులను మాత్రమే బ్రాహ్మణాలూ, ఉపనిషత్తులూ వివరించాయి. ఆ మహర్షుల జీవితాలకు సంబంధించిన విశేషాలు ఛాయామాత్రంగానైనా అందులో అగుపించవు. బోద్ధల కన్నా వారి బోధనలే ముఖ్యమన్న ఆనాటి సామాజిక విశ్వాసమే బహుశా అందుకు కారణమై ఉండవచ్చు. వేదకాలపు ఋషులంతా తమ బోధనల ద్వారానే ప్రసిద్ధిచెందారు. వారి వ్యక్తిగత జీవితానికి సంబంధించిన అస్పష్ట రూపురేఖలు మాత్రం ప్రాచీన భారతీయ సాహిత్యంలో మనకు గోచరిస్తాయి. కానీ బుద్ధ భగవానునికీ మనకూ మధ్య దాదాపు 26 శతాబ్దాల అంతరం ఉన్నప్పటికీ పాళీ ధార్మిక సాహిత్యంలో వెల్లడించిన వివరాలు ఆ మహనీయుని విశిష్టజీవిత చిత్రాన్ని ప్రస్ఫుటంగా చూపగలుగుతాన్నయంటే ఆయన విలక్షణ వ్యక్తిత్వ ఔన్నత్యమే అందుకు కారణం అనుకోవలసి ఉంది.

సమగ్ర సత్య ద్రష్టలయిన బుద్ధులు మానవకోటికి ముక్తి మార్గం చూపేందుకు ఆయాకాలాల్లో అవతరిస్తుంటారన్న విశ్వాసం కూడా ప్రాచీన భారత వర్షంలో ప్రబలంగా ఉండేది. బుద్ధుల లక్షణాల గురించి, గుణగణాల గురించి కూడా ప్రాచీన భారతీయులకు కొన్ని నిశ్చితాభిప్రాయాలుండేవి. అందుచేత బుద్ధ జీవితగాథ రెండు రకాలుగా ఉండే అవకాశం ఉంది. ఒకటి బుద్ధుని యథార్థ జీవిత ప్రాతిపదిక మీద ఆధారపడితే రెండవది బుద్ధుడు ఎలా ఉండాలన్న విశ్వాసాల మీద రూపొందింది. తొలి బౌద్ధ సాహిత్యంలో మొదటి ధోరణి

అగుపించగా, ఆ తర్వాత వెలువడిన బౌద్ధ గ్రంథాల్లో ద్వితీయ ధోరణి కనిపిస్తుంది. వీటిలో బుద్ధుని జీవిత విశేషాలూ, బోధనలూ చాలా వివరంగా వర్ణనాత్మకంగా కనిపిస్తాయి. అయితే ఈ చిత్రణ అంతా బుద్ధుడెలా ఉంటాడన్న ఆనాటి జనవిశ్వాసానికి అనుగుణంగా వాస్తవ జీవితానికి దూరంగా ఉన్నట్లు అనిపిస్తుంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే పౌరాణిక, ప్రబంధ ధోరణులకు దగ్గరగా ఉంది.

త్రిపిటకాల్లో వినయపిటకం, సుత్తపిటకం గౌతముని బోధనలకూ కార్యకలాపాలకూ సంబంధించిన వివరాలను తెలియజేస్తాయి. ఆయన ఏయే నియమాలను ఎందుకు విధించాడు? ఏయే బోధనలను ఏ సందర్భంలో ప్రవచించాడన్న వివరాలను కూడ అవి అందిస్తాయి. వినయ పిటకం సంఘ నియమావళిని సహేతుకంగా తెలుపుతుంది. సుత్తపిటకం బుద్ధుని బోధనలను సందర్భసహితంగా వివరిస్తుంది.

పాళీ ధార్మిక గ్రంథాల్లో బుద్ధుని జీవిత విశేషాలు క్రమబద్ధంగా కనిపించకపోయినా, ఆయన జీవితానికి సంబంధించిన అనేక ముఖ్య ఉదంతాలను, ఆనాటి సామాజిక పరిస్థితులను కూడా అవి చాలా వరకు ప్రతిబింబిస్తాయి.

గౌతముడు శాక్యవంశ క్షత్రియుడైన శుద్ధోదనుని పుత్రుడు. పొరుగు రాజ్యమైన కోసల లాగా రాచరిక వ్యవస్థను కాకుండా శాక్యులు గణతంత్ర పాలనను పాటించారు. అయినా శాక్యులు కోసల రాజ్యాధి పత్యంలోనే ఉండేవారు. ఈ గణతంత్ర సమాజ పాలనా వ్యవహారాలను ఒక సమాలోచన సభ నిర్వహించేది. దానికి రాజు అధ్యక్షత వహించేవాడు. గౌతముడు జన్మించే నాటికి శుద్ధోదనుడు సభాధ్యక్షుడుగా ఉన్నాడు. శాక్యులను ఆత్మాభిమానం, సమరశీల స్వభావంగల జాతిగా త్రిపిటకాలు వర్ణించాయి. గౌతముడు ఎంత సాధుమూర్తి, సంయమనశీలి అయినా స్వతంత్ర భావ వ్యక్తీకరణలోనూ, వైదిక కర్మకాండలను ఖండితంగా నిరసించడంలోనూ, సాధికారధోరణిలోనూ ఆయన జాతి సహజ లక్షణాలు ప్రస్ఫుటమవుతాయి.

శాక్య రాజధానియైన కపిలవస్తుపురం భారత-నేపాల్ సరిహద్దుల్లో కాశికి ఉత్తరాన వందమైళ్ల దూరంలో ఉంది. వరి పంట, పశుపాలనలే ఆ రాజ్య ఐశ్వర్యానికి మూలం. దాని చుట్టూ ఉన్న దట్టమైన అడవులు, దారి దోపిడీలు చేసే దొంగల ముఠాలకు ఉనికి పట్టుగా ఉండేవి.

బుద్ధుని కన్నతల్లి మాయకూడా శాక్యవంశీకురాలే. ఆమె నిండు చూలాలుగా ఉన్న సమయంలో తన పుట్టినిల్లయిన దేవదహాకు వెళ్లుతూ మార్గమధ్యంలో ఉన్న లుంబినీ వనంలో సిద్ధార్థుని ప్రసవించింది. ఆ తర్వాత ఏడు రోజులకే తల్లి మాయ మరణించడంతో, ఆమె చెల్లెలు, శుద్ధోదనుని ద్వితీయ కళత్రమైన మహాప్రజాపతి ఆ బిడ్డను పెంచి పెద్దజేసింది. ఆసితుడనే ఋషి బాల సిద్ధార్థుని సందర్శించి ఆ బాలుని భవిష్యత్తు మహోజ్వలమని చెబుతూ, అయితే అతని అపూర్వ సందేశాన్ని ఆలకించి తరించే మహద్భాగ్యం వార్ధక్యంలో ఉన్న తనకు లేదని ఆవేదన చెందినట్టు సుత్తనిపాతం చెబుతుంది.

బుద్ధునికి తల్లిదండ్రులు పెట్టినపేరు సిద్ధార్థుడు. అంటే లక్ష్యాన్ని సాధించినవాడు. అయితే ఈ పేరు బౌద్ధసాహిత్యంలో అరుదుగానే అగుపిస్తుంది. గౌతముడు, శాక్యముని, శాక్యసింహ, తథాగతుడన్న నామ సముదాయమే తరచుగా కనిపిస్తుంది. కానీ అన్నిటి కన్నా బుద్ధుడన్న పేరే ఎక్కువగా వాడుకలో ఉంది. భగవాన్ అన్న సంబోధన కూడా విరివిగానే ఉపయోగించబడింది.

కుటుంబాన్నిత్యజించి - అనికేతనుడై - ఏకాంత వాసంలో, సత్యాన్వేషణ చేయడమే గౌతముని కాలంలో ధార్మిక జీవనం అత్యున్నత లక్ష్యంగా పరిగణించబడేది. ధార్మిక జీవనం గడిపేందుకు పరివ్రాజకులుగా మారడం గొప్ప ఆదర్శంగా ఆనాటి సమాజంలో బ్రాహ్మణ, క్షత్రియ వర్గాలు భావించేవి. కాగా ధార్మిక ప్రవృత్తి గల సిద్ధార్థుని దృష్టి ఆవైపు మరలడం సహజమే.

బాధావహమైన జీవిత సత్యాలకు దూరంగా, కేవలం ఆహ్లాదకరమైన కల్పిత వాతావరణంలో ఎంతో జాగ్రత్తగా సిద్ధార్థుని పెంచారనీ, అయినా యాదృచ్ఛికంగా అగుపించిన రుజా, జరా, మరణ దృశ్యాల వల్ల ఆయన కలత చెందారనీ బహుళ ప్రచారంలో ఉన్న బౌద్ధధార్మికగాథలు బోధిస్తున్నాయి. ఈ మనః పరివర్తనోదంతాన్ని ప్రాచీన గ్రంథాలు నిరాకరించకపోయినా, గట్టిగా ధ్రువీకరించకపోవడం గమనార్హం. 'అంగుత్తారనికాయం'లో ఒకచోట బుద్ధుడు గతంలో ఒకప్పుడు తాను గడిపిన సుఖభోగ విలాస భూయిష్ఠమైన జీవితాన్ని వర్ణిస్తూ జరా రుజా మరణ దృశ్యాలు చూడడానికి జనం ఎలావైముఖ్యం వహిస్తారో చెబుతాడు. ఇది సరైనదేనా? "నేను

కూడా నశించి పోయేవాడినే కదా? వార్ధక్యం, వ్యాధులు, మరణాల నుంచి నేనుకూడా తప్పించుకోలేను కదా? అలాంటప్పుడు ఇతరులను ఆస్థితిలో చూసి నేను వ్యథా, భయగ్రస్తుడిని కావడం వైముఖ్యం వహించడం సముచితమా? భిక్షువులారా! నేను ఇలా ఆలోచించినప్పుడు నా జీవితానందమంతా లోలోపలే ఇంకిపోయింది." అన్నాడు.

పదహారేళ్ల వయస్సులో సిద్ధార్థుడు తన బంధువర్గంలోని యశోధరను అర్ధాంగిగా స్వీకరించాడు. ఆ దంపతులకు రాహులుడనే కొడుకు పుట్టాడు. ఇరవైతొమ్మిదేళ్ల ప్రాయంలో సిద్ధార్థుడు అందాల రాశియైన అర్ధాంగినీ, ముద్దులు మూటగట్టే పసికందయిన కుమారునీ, అపారమైన ఐశ్వర్యాన్ని, సకల విధ సుఖభోగాలనూ పరిత్యజించి, ఇల్లు వదలి అనికేతనావస్థకు నిష్క్రమించాడు. ఆకాలంలో గంగా నదీలోయలో జ్ఞాన నిధులుగా, పవిత్రులుగా ప్రసిద్ధికెక్కిన గురువు లెందరో ఉండేవారు. ఆరేళ్లపాటు సిద్ధార్థుడు వారిని ఆశ్రయించి జ్ఞాన సముపార్జన చేశాడు. సుప్రసిద్ధ గురువులయిన అలారకలామ, ఉద్దక రామపుత్రుల వద్ద కొంత కాలం శిష్యరికంచేసి, వారి బోధలను ఆకళించుకున్నాడు. కానీ, అవి పరిపూర్ణజ్ఞానాన్నీ, ముక్తి మార్గాన్నీ చూపలేవని గ్రహించి, వాటిని తిరస్కరించి వెళ్లిపోయాడు. తదనంతరం ఆరేళ్లపాటు మగధ రాజ్యంలో పరివ్రాజక జీవితం గడిపి చివరకు ఉరువేల (ఇప్పటి బుద్ధగయ) కు చేరుకున్నాడు. స్వచ్ఛమైన నదీజలాలతో, సానుకూలమైన స్నాన ఘట్టాలతో, నలువైపులా నయన మనోహరమైన హరితమైదానాలూ, పల్లెపట్టులూ ఉన్న ఆ అటవీ ప్రాంతం సిద్ధార్థునకి చాలా ఆహ్లాదకరంగా తోచింది. అక్కడే తీవ్ర తపస్సమాధిలో నిమగ్నం కావాలని సంకల్పించాడు.

ఉరువేలలో సిద్ధార్థుని తపోదీక్ష, సత్యసాధనకు ఆయన సాగించిన అవిశ్రాంత సమరంగా ప్రఖ్యాతిగాంచింది. త్రిపిటకాలు ఆతపస్సును హృదయానికి హత్తుకొనేట్లు వర్ణించాయి. నిప్పుపుట్టించాలంటే పచ్చికట్టెలతోకాదు, ఎండు కట్టెలతో రాపిడి చేయవలసి ఉంటుంది. అలాగే జ్ఞానోదయం కావాలంటే శరీరాన్ని శుష్కింపజేసి నిర్మలంగా ఉంచాలని గౌతముడు పళ్లు బిగించి, నాలుకను అంగిటికినొక్కిపట్టి

ధ్యానమగ్నుడయ్యాడు. ఈ తపస్సాధనలో ఆయన బాహుమూలాలనుంచి స్వేద జలం సెలయేళ్లలా ప్రవహించింది. ఆ తర్వాత శ్వాసను నియంత్రించి, క్లిష్టతర ధ్యానముద్రను కొనసాగించాడు. ఈ వేదనా భరితమైన సాధనలో ఒక స్థితి నుంచి మరో స్థితికి పురోగమించే కొద్దీ శిరస్సులో రక్తం పరవళ్లుతొక్కుతున్నట్లు, కపాలం రెండుగా చీలుతున్నట్లు ఎవరో కరకత్తితో కడుపు చీల్చుతున్నట్లు, చివరకు కణకణమండే నిప్పుల గుండంలో పడికాలిపోతున్నట్లు సిద్ధార్థునికి అనిపించింది. క్రమ క్రమంగా ఆహారాన్ని తగ్గించుకుంటూ చివరకు రోజుకు ఒక ధాన్యపు గింజను మాత్రమే తినే స్థితికి చేరుకున్నాడు. కొంత కాలం కందమూలాలు, పచ్చిగడ్డి, విత్తనాలు తినిజీవించాడు. కేశ కంబళ్లు, జుగుప్స కలిగించే ఇతర దుస్తులు ధరించాడు. జుట్టు, గడ్డంలో ఒక్కొక్క వెంట్రుక చొప్పున పీకివేశాడు. రోజుల తరబడి నిలబడి, ముళ్లకంప మీద పండుకొని గడిపాడు. దేహం మీద దుమ్ము, ధూళి పొరలు పొరలుగా పేరుకొని ఎండిన మోడు లాగా కనిపించసాగింది. తరుచుగా శ్మశానానికి వెళ్ళి కుళ్లి కంపు గొడుతున్న శవాల మధ్య పండుకొనేవాడు. ఇన్ని అసహ్యాయాతనలు అనుభవించినా జీవిత చిక్కుముడిని విడదీసే మార్గం చూచాయగా కూడా అగుపించలేదు. శరీరం చిక్కిశల్యమై, మృత్యువు అంచుల్లోకి చేరి, కదలాడే నీడలా మారిపోయాడు. "నేను కడుపు తాకితే వీపు, వెన్నుతాకితే కడుపుతగిలేవి. కఠిన ఉపవాస దీక్షల వల్ల పొట్ట వెన్నుకు అంటుకపోయింది." అని సిద్ధార్థుడే అప్పటి దైన్య స్థితిని గురించి ఒక 'సూత్రం'లో స్వయంగా వివరించాడు.

కఠోరసాధనలతో దేహశోషణలో అంతిమ స్థాయికి చేరుకున్నా తాను ఆశించిన జ్ఞాన సిద్ధి కాకపోవడంతో జ్ఞాన సాధనకు మరో మార్గమేదైనా ఉండాలని ఆయన భావించాడు. ఈ సందర్భంలో బాల్యావస్థలో జంబూవృక్షం కింద ధ్యానమగ్నుడైనప్పుడు పొందిన ఆనంద పారవశ్యానుభూతి స్మృతి పథంలో మెదలింది. కానీ, దానికి దేహ పటుత్వం కావాలి. అందుకు ఆహారం అత్యవసరం. అందుచేత కొంచెం అంబలితాగాడు. ఈ దృశ్యాన్ని ఆపరిసరాల్లో ఉన్న ఐదుగురు సన్యాసులు చూశారు. తపోదీక్షలో ఉన్న సిద్ధార్థునికి జ్ఞాన సిద్ధి కలిగితే దాన్ని తమకు కూడా అందజేస్తాడని అంత వరకు ఎదురు చూస్తూ శుశ్రూషలు చేసిన ఆయతి పంచకం

సిద్ధార్థుడు ఆహారం తీసుకోవడం చూసిన తర్వాత ఆయన మీద నమ్మకం నశించి నిరాశతో దూరంగా వెళ్లిపోయింది.

ఆహారం తీసుకున్న తర్వాత సిద్ధార్థుడు మళ్లీ ధ్యానంలో లీనమై అందులో నాలుగు దశలను అధిగమించి శుద్ధస్వానుభవాన్ని, సమచిత్తతనూ సాధించి సుఖదుఃఖాల నుంచి విముక్తుడయ్యాడు. పూర్వజన్మపరంపరను మనోనేత్రంతో అవలోకించాడు. ఆతర్వాత శాక్యమునికి మరింత విస్తృత దర్శనం లభించింది. సమస్త విశ్వం కర్మ, పునర్జన్మల నియమానుసారం సాగుతున్న వ్యవస్థగా గోచరించింది. అల్పజీవులూ, ఉత్తమ జీవులూ, సుఖ సంతృప్త, బాధాసంతప్త ప్రాణులూ - మొత్తం ప్రాణికోటి అంతావాటి కర్మానుసారం మరణించి, మరోరూపంలో మళ్లీ జన్మించడాన్ని ఆయన ఆ దివ్యదర్శనంలో వీక్షించాడు.

చివరకు సిద్ధార్థుడు సార్థక నామధేయుడై లక్ష్యాన్ని సాధించగలిగాడు. తృష్ణ దుఃఖాల స్వభావాన్నీ దుఃఖోపశమన మార్గాన్నీ తెలుసుకున్నాడు. ఆవిధంగా పరిపూర్ణ జ్ఞానోదయమైంది. ఆస్థితిని గురించి వివరిస్తూ ఒక సందర్భంలో ఆయన ఇలా అన్నాడు. "అలా విముక్తుడినైన నాకు జన్మరాహిత్యం సిద్ధించిందనీ, ఈ లోకంలో చేయవలసిందంతా చేశాననీ, ఇక నిర్వర్తించవలసిన కర్తవ్యాలేమీ మిగల్లేదనీ, ఆధ్యాత్మిక జీవితంలో అంతిమ ఘట్టాన్ని అందుకున్నాననీ తెలిసిపోయింది. ఈ పరిపూర్ణజ్ఞానం నాకు రాత్రి చివరి జాములో కలిగింది. అజ్ఞానం సాంతం అంతరించింది. కాంతి కిరణాలు సోకగానే గాఢాంధకారం పటాపంచలైంది. సుస్థిర, సుదృఢ చిత్తంతో అలాగే కూర్చుండి పోయాను".

జ్ఞానోదయానంతరం తానుగ్రహించిన సత్యాన్ని ఇతరులకు బోధించినా ప్రయోజనం శూన్యమనే నిర్లిప్తభావం సిద్ధార్థుని ఆవహించింది. ఈ సిద్ధాంతం చాలా జటిలమైంది. తృష్ణా నిబద్ధమైన మానవాళి కార్యకారణ సంబంధాన్నీ, వాంఛలనూ అధిగమించి నిర్వాణ పదం సాధించాలన్న బోధలను అర్థం చేసుకోవడం సాధ్యమా? అని ఆలోచించి, ఎలాంటి బోధలు చేయకుండా మౌనంగా ఉండాలని ఆదిలో అనుకున్నాడు. అయితే తన బోధనను గ్రహించగలిగిన వారు కొంతమందైనా ఈ పెడదారి బడిన లోకంలో ఉంటారన్న ఆలోచనతో సత్యాన్ని బోధించాలనే

ఎట్టకేలకు బుద్ధుడు ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆ తర్వాత ఆయన తన మనో నేత్రంతో ప్రపంచాన్నంతా ఒకమారు అవలోకించి "కొలనులో నీల, లోహిత, శ్వేత వర్ణ కమలాలుంటాయి. వాటిలో కొన్ని నీటి అడుగున పుట్టి అక్కడే ఉండిపోతాయి. కొన్ని నీటి ఉపరితలం వరకూ పెరుగుతాయి. మరికొన్ని నీరు తగలనంత ఎత్తుకుచేరుతాయి. లోకంలో జనం కూడా అలాగే వివిధ స్థాయీ భేదాలతో ఉన్నారు.'' అని బుద్ధుడు భావించాడు. అంతేగాక "అమృత పద ద్వారాలు తెరుచుకున్నాయి, ఈ సత్యాన్ని వినగలిగిన వాళ్లంతా విని విశ్వసింతురుగాక'' అని అనుకున్నాడు.

తాను గ్రహించిన పరమసత్యాన్ని మొదట ఎవరికి వివరించాలని బుద్ధుడు ఆలోచించినప్పుడు తన తొలి గురువులు ఆయన దృష్టికి వచ్చారు. అయితే వారు అప్పటిక మరణించినట్లు జ్ఞానచక్షువులతో గ్రహించాడు. తాను కఠోర తపస్సాధనలో ఉన్నప్పుడు తనకు శుశ్రూషలు చేసి, తాను ఉపవాస దీక్ష విరమించగానే నిరసన భావంతో నిష్క్రమించిన అయిదుగురు సన్యాసులు ఆయనకు గుర్తుకొచ్చారు. వాళ్లు ప్రస్తుతం 'ఇసి పతన'లో ఉన్నట్లు దివ్య దృష్టితో తెలుసుకున్నాడు. కొంతకాలం తనకు జ్ఞానోదయం కలిగిన ఉరువేలలో ఉన్న తర్వాత ఆయతి పంచకాన్ని అన్వేషిస్తూ బయలుదేరాడు. మార్గమధ్యంలో తారసిల్లిన ఒక దిగంబర సన్యాసి ప్రశ్నలకు సమాధానం ఇస్తూ మొట్టమొదటిసారి తనను బుద్ధుడుగా ప్రకటించుకుని "నేను పరిపూర్ణ జ్ఞానాన్ని పొందాను. నిశ్చల ప్రశాంత చిత్తుడనై నిర్వాణ పదాన్ని అధిరోహించాను. ధర్మచక్ర పరివర్తనార్థమై కాశికి వెళ్లుతున్నాను. అజ్ఞానాంధకారంలో మగ్గుతున్న లోకంపై జ్ఞాన కిరణాలను ప్రసరింపజేస్తాను'' అన్నాడు.

బుద్ధుడు శ్రమణులు నివసిస్తున్న మృగదావనం చేరినప్పుడు అక్కడ ఆయన అన్వేషిస్తున్న అయిదుగురు సన్యాసులు అగుపించారు. సిద్ధార్థుడు తపోధర్మాన్ని పరిత్యజించి సుఖమయ జీవితం గడుపుతున్నాడు కాబట్టి అతనికి అభివాదం చేయకూడదని వారు నిర్ణయించుకున్నారు. కాని బుద్ధభగవానుడు దగ్గరికి రాగానే ఆయన ప్రభావానికి లోనై అప్రయత్నంగానే ఎదురేగి పాద్యానికి నీరుతెచ్చారు. అలా గౌరవిస్తూనే వారు బుద్ధుని మిత్రమా, గౌతమా, అని సంబోధించారు.

తథాగతుని ఇలా పేరు పెట్టి, మిత్రమా అని సంబోధించడం సముచితం కాదనీ, తాను జ్ఞానసిద్ధి పొంది బుద్ధుడినయ్యాననీ వారికి సత్యబోధ చేయడానికి సిద్ధంగా ఉన్నానని అన్నాడు. అయితే తీవ్ర తపస్సాధనను విడనాడి, సాధారణ జీవితం గడుపుతున్న వారికి జ్ఞానోదయమయ్యే అవకాశమే లేదని ఆ సన్యాసులు అన్నారు. బుద్ధుడు వారి సందేహ నివృత్తి చేసి, ధర్మోపదేశానికి ఉపక్రమించాడు.

## ధర్మ చక్ర ప్రవర్తన

బుద్ధుడు యతి పంచకానికిచ్చిన తొలి సందేశంలో ఇలా అన్నాడు :

"జీవితం పట్ల రెండు పూర్తి భిన్న దృక్పథాలున్నాయి. ఇంద్రియ సుఖాల కోసం ఆరాటపడుతూ బ్రతకడం మొదటిది. ఇది చాలా హేయమైంది. ఎంత మాత్రం శ్రేయస్కరం కాని మార్గం. సంపూర్ణంగా ప్రాపంచిక విషయాల్లో మునిగితేలేవారు దీన్ని అనుసరిస్తారు. రెండవది దేహశోషణకు సంబంధించింది. ఇది చాలా బాధావహమే కాదు పూర్తిగా నిష్ప్రయోజనకరమైంది కూడా. తథాగతుడు కనుగొన్న మధ్యేమార్గం మానవాళి కళ్లు తెరిపిస్తుంది. అది సదవగాహనను, శాంతిని, సమున్నత జ్ఞానాన్ని సమీక్షించే అంతర్ దృష్టిని ప్రసాదిస్తుంది. నిర్వాణపదానికి పథనిర్దేశం చేస్తుంది. సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యగ్వచనం, సమ్యక్ కర్మ, సమ్యక్ జీవనం, సమ్యక్ కృషి, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి అన్న అష్టాంగ మార్గం ఇదే.

దుఃఖానికి సంబంధించిన ఆర్యసత్యం ఇది : జన్మదుఃఖం, జరాదుఃఖం, మరణం దుఃఖం, ప్రియవియోగం దుఃఖం, అప్రియ సంప్రాప్తం దుఃఖం - క్లుప్తంగా చెప్పాలంటే రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానాలన్న పంచస్కంధాలూ దుఃఖాలే.

దుఃఖహేతువుకు సంబంధించిన ఆర్య సత్యమిది: సుఖాపేక్ష, కామవాసనా భూయిష్ఠమైన తృష్ణే పునర్భవానికి మూలకారణం. తృష్ణ, ఆశ, భయం, క్రోధం, ద్వేషం - ఇవి దుఃఖ కారణాలు.

దుఃఖోపశమనానికి సంబంధించిన ఆర్య సత్యమిది: వాంఛలనుండి విముక్తి సాధించి తృష్ణారాహిత్యాన్ని పొందడమే దుఃఖోపశమనం.

దుఃఖోపశమన మార్గానికి సంబంధించిన ఆర్యసత్యమిది: ఇదే సమ్యక్ దృష్టి సమ్యక్ సంకల్పం, సమ్యక్ వాక్కు, సమ్యక్ కర్మ, సమ్యక్ జీవనం, సమ్యక్ కృషి, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి అనే ఆర్య అష్టాంగ మార్గం"

ఈ ఉపదేశాన్ని విన్న ఐదుగురు సన్యాసులూ కొత్త మార్గాన్ని స్వీకరించి తమ పాత సాధనలకు స్వస్తి చెప్పారు. ఈ ఆదిభిక్షు వర్గంలో కొండన్నకు మొదటి మార్గఫలం తక్షణమే లభించింది. ఆ తర్వాత నాలుగు రోజులకు మిగతా నలుగురు ఆఫలాన్ని పొందారు. ఐదవ రోజున బుద్ధుడు భిక్షుక పంచకాన్ని తన దగ్గరకు ఆహ్వానించి అనాత్మ సందేశం ఇచ్చాడు.

"భిక్షువులారా! నశ్వరమైన శరీరం శాశ్వతమైన ఆత్మకాజాలదు. అలాగే సంకల్ప, రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానాలు కూడా శాశ్వతమైన ఆత్మ కాలేవు, మిగతా అన్నిటిలాగే చైతన్యం సైతం నశించిపోయేదే. రూపం, ఇంద్రియానుభూతులూ, అనుభవాలూ, మనసూ, చైతన్యం ఇవన్నీ శాశ్వతాలా? అశాశ్వతాలా? మీరే మనుకుంటున్నారు? ఈ ప్రశ్నలకు అయిదుగురు భిక్షువులూ అవి అశాశ్వతాలని బదులు చెప్పారు. అశాశ్వతమైంది మంచిదా? చెడ్డదా? అంటే చెడ్డదే అన్నారు. అశాశ్వతమూ, పరివర్తనా శీలమూ అయిన దాన్ని, దుష్టమైన దాన్ని 'ఇది నాది. ఇదే నేను. ఇది శాశ్వతమైన ఆత్మఅనవచ్చునా?' అంటే 'లేదు. అలా చెప్పడానికి వీల్లేదు' అన్నారు ఆ భిక్షువులు. దానిపై బుద్ధుడు ఇలా అన్నాడు. 'కాబట్టి భిక్షువులారా, భౌతిక రూపాలు గతానివైనా, వర్తమానానివైనా, మానసికమైనవైనా, బాహ్యసంబంధమైనవైనా, దగ్గరివైనా, దూరానివైనా నీచమైనవైనా, ఉన్నతమైనవైనా, ఇది నేను కాదు. ఇది శాశ్వతమైన ఆత్మ కాదు' అనే చెప్పాలి. అలాగే సకల ఇంద్రియానుభూతులూ, సమస్త అనుభవాలూ సంకల్పాలూ, చైతన్యాన్ని గురించి కూడా ఇదే మాట చెప్పాలి.

భిక్షువులారా, ఈ విషయాలను గ్రహించిన సత్యాన్వేషి, పైన పేర్కొన్న పంచస్కంధాల పట్లవైముఖ్యం వహించి తృష్ణారహితుడై, ముక్తుడై తనకు పునర్భవం ఇకలేదనీ, తాను పవిత్ర జీవితం గడిపానని, మృత్యువును శాశ్వతంగా జయించానని తెలుసుకుంటాడు.'

ఈ ప్రబోధంతో ఐదుగురు భిక్షువుల మనస్సుల్లో పూర్ణజ్ఞానోదయమైంది. పంచవర్గీయ భిక్షువులుగా ప్రసిద్ధికెక్కిన ఈ మొదటి ఐదుగురు అర్హతులకూ బౌద్ధ సంప్రదాయంలో విశిష్టస్థానం ఉంది.

బౌద్ధ ధర్మాన్ని స్వీకరించిన రెండవ బృందం కాశిలోని సంపన్న వాణిజ్య కుటుంబాలకు చెందింది. యశుడు, అతని యాభైనాలుగుమంది మిత్రులూ భిక్షువులుగా మారినందువల్ల అర్హతుల సంఖ్య అరవై ఒకటి అయింది. ఇంద్రియ బంధాలను ఛేదించుకొని, పరిపూర్ణజ్ఞాన సిద్ధి పొందిన వారినే అర్హతులంటారు. అర్హతుడీలోకంలో నిస్సంగుడై, ఆనందంగా, పరోపకారియై జీవిస్తాడు.

తన అనుచరులనుద్దేశించి ప్రసంగిస్తూ బుద్ధుడు ఇలా అన్నాడు. "భిక్షులారా! నేను మానవ, దైవిక బంధాలన్నిటి నుంచి విముక్తుడినయ్యాను. నాలాగే మీరు కూడా ముక్తులయ్యారు. ఇక మీరు కరుణోపేతులై బహుజన హితం కోసం, బహుజన సుఖం కోసం, దేవతల, మానవుల మంచి కోసం ఉద్యమించండి. మీలో ఏ ఇద్దరూ కలిసి ఒక మార్గంలో సంచరించవద్దు. ఆద్యంత విశిష్టమూ, శ్రేష్టమూ అయిన ఈ ధర్మాన్ని మీరు బోధించండి. సమగ్ర, సంపూర్ణ పవిత్ర జీవితాన్ని గురించి ప్రబోధించండి". బుద్ధుడు కొత్తగా సంఘంలో చేరే వారికి దీక్ష ఇవ్వడానికి కూడా భిక్షువులకు అనుమతిచ్చాడు. తదనంతరం ఆయన తనకు జ్ఞానోదయం కలిగిన ప్రదేశం ఉరువేలకు తిరిగి వెళ్లాడు. అక్కడ వెయ్యిమంది జటిలులను తన నూతన పంథాకు మార్చాడు. గృహస్థ జీవితాన్ని త్యజించి సన్యాసం స్వీకరించిన తర్వాత కూడా యజ్ఞయాగాదులను నిర్వహించే బ్రాహ్మణులను 'జటిలు' లంటారు. వారికి బుద్ధుడు ఆదిత్య పరియాయ సూత్రాన్ని బోధించాడు.

"భిక్షువులూ! చూశారా!
సర్వస్వం జ్వలిస్తోంది.
ఆమండే సర్వస్వం
ఏమిటి భిక్షువులారా!
కళ్లూ, రూపం రెండూ
కణకణమని మండినాయి
చక్షుయుగ్మ చైతన్యం,
స్పర్శ కూడా జ్వలిస్తోంది.
చక్షు, స్పర్శకు చెందిన
సంవేదన రగులుతోంది
బాధా ఆహ్లాదం ని
ర్లిప్తత ఏదైనా సం
వేదన సుఖమూ దుఃఖం
అ దుఃఖం అసుఖమూ
అన్నీ ఆ మంటల్లో
అవిగో జ్వలియిస్తున్నవి
భిక్షువులూ ఆ మంటలు
రాగ మోహ విద్వేషాలే
జన్మ మృత్యు వ్యాధి
దుఃఖ పరిదేవనా
శోక నిస్పృహలతో
ఆ మంట ఎడతెగక
మండిపోతున్నాది"

బుద్ధుడు తన శిష్యులతో రాజ గృహకు వెళ్లి నగరానికి బయట వేణువనంలో బసచేశాడు. అక్కడ మగధ సమ్రాట్ బింబిసారుడు ఆయనను దర్శించి తన

భవనానికి భిక్షకు ఆహ్వానించాడు. బోధనానంతరం బుద్ధుని ధర్మ ప్రబోధం విన్నాక వేణువనాన్ని బింబిసారుడు భిక్షు సంఘానికి కానుకగా సమర్పించుకున్నాడు. అదే సమయంలో సంజయుడనే గురువు రెండు వందల యాభై మంది శిష్యులతో రాజగృహలో విడిది చేసి ఉన్నాడు. ఆయన శిష్యుల్లో ఇద్దరు - సారిపుత్ర, మౌద్గల్యాయనులు - భిక్షాటన చేస్తున్న బుద్ధ శిష్యుడు అశ్వజిత్ తేజో గాంభీర్యాలను గమనించారు. సారిపుత్రుడు అతని దగ్గరికి వెళ్లి మాటామాటా కలిపి నీ గురు వెవరు? ఆయన బోధనలేమిటి? అని ప్రశ్నించాడు. అశ్వజిత్ సమాధానం చెబుతూ "సోదరా శాక్యమునిని అనుసరించేందుకు నేను ప్రపంచాన్ని పరిత్యజించాను. బౌద్ధ ధర్మాన్ని స్వీకరించి ఇంకా ఎక్కువ కాలం కాలేదు అయినా నాకు తెలిసిన మేరకు ఆ ధర్మసూత్రాన్ని వివరిస్తా"నంటూ ఇలా అన్నాడు. "ఆ సత్యదర్శి (అయిన బుద్ధభగవానుడు) హేతుబద్ధమై జన్మించే వాటికన్నిటికీ కారణాలు వివరించాడు. పునర్భవాన్ని అంతం చేసే మార్గాన్ని చూపించాడా మహాజ్ఞాని" అన్నాడు. దానితో సారిపుత్ర, మౌద్గల్యాయనులు సహశిష్యగణంతోపాటు బౌద్ధ ధర్మాన్ని స్వీకరించి సంఘంలో చేరారు.

బుద్ధుని బోధనల వల్ల రాజ వంశాలకు చెందిన చాలా మంది యువకులు బౌద్ధ సంఘంలో భిక్షువులుగా చేరసాగారు. దానితో ప్రజల్లో గౌతముడు యువకులను భిక్షువులుగా మారుస్తూ సంతానం కలుగకుండా చేసి క్షత్రియ వంశ వినాశకుడవుతున్నాడన్న విమర్శలు వినిపించసాగాయి. ఇతడు సంజయుని శిష్యులందరినీ సంఘంలో చేర్చుకుని గిరివ్రజానికి వచ్చాడు. ఇక్కడ ఇంకెందరిని లో బరుచుకుంటాడో అన్న గుసగుసలు కూడా బయలుదేరాయి. ఈ విషయాన్ని బుద్ధుని దృష్టికి తెచ్చినప్పుడు ఈ సంచలనం ఓ వారం రోజులుంటుందనీ, అయినా ఆ ఆరోపణలకు సమాధానమివ్వాలనీ చెబుతూ అదెలా ఉండాలో వివరిస్తూ :

"బుద్ధులు సద్ధర్మంతో<br>ప్రజకు దారిచూపుతారు<br>సత్య వాక్కుతో జనులను

సత్ప్రథాన నడిపించే
బుద్ధుల నాక్షేపించే
జడ బుద్ధులు ఒక లెక్కేమిటి?"

అని శిష్యుల్లో ఆత్మ విశ్వాసాన్ని ఉదీప్తం చేశాడు.

## కపిలవస్తు పురానికి పునరాగమనం

కోతపెట్టే శీతాకాలం గతించింది. పచ్చని లేత పచ్చిక బయళ్లూ, రంగు రంగులతో విరబూసిన పూలచెట్లు నేల తల్లికి కొంగొత్త అలంకారాలు సమకూర్చాయి. ఈ ఋతులీలావిలాసాలతో రహదారులు యాత్రికులకు మనోహరంగా ఆహ్లాదకరంగా మారిపోయాయి. ఒక నిండుపున్నమి నాడు బుద్ధుడు తన శిష్యగణంతో కపిలవస్తుకు బయలు దేరాడు. ఉత్తమ వంశీకులయిన చాలామంది అర్హతులతో రోజుకొక కోసుదూరం నడుస్తూ, దారి పొడుగునా ధార్మిక ప్రబోధం చేస్తూ రెండు నెలలకు గమ్యం చేరుకున్నాడు. రాచ కుటుంబాలకు చెందిన పురుషులు, కన్యలు, పిల్లలూ బుద్ధ పరివారానికి ఎదురేగి పుష్పగుచ్ఛాలతో మహానందంగా స్వాగతం పలికారు. ఆయన కోసం ఎంపిక చేసిన నయన మనోహరమైన నిగ్రోధ వనానికి బుద్ధుని తీసుకెళ్లారు.

## శాక్య కుమారులకు దీక్ష

మరునాడు బుద్ధుడు అనేక అర్హతులతో కలిసి కపిలవస్తులో భిక్షాటన సాగించాడు. రాజకుమారుడైన సిద్ధార్థుడు పట్టణంలో ఇంటింటికి తిరిగి బిచ్చమెత్తుతున్నాడన్న వార్త సర్వత్రా సంభ్రమాశ్చర్యాలు కలిగించింది. ఉన్నత సౌధాల గవాక్షాల నుంచి జనం ఆ దృశ్యాన్ని తొంగిచూశారు. సిద్ధార్థుని అర్థాంగి యశోధర స్వయంగా ఈ అపూర్వ, విచిత్ర దృశ్యాన్ని తిలకించి ఆశ్చర్యచకితయై ఆ ఉదంతాన్ని శుద్ధోధనునికి

తెలిపింది. తన కుమారుడు తిండికోసం తిరిపమెత్తడమా? శాక్య క్షత్రియ వంశానికి ఇది అవమానం కాదా? అని ఖిన్నుడైన శుద్ధోదనుడు ఇది తగదని కొడుక్కు నచ్చ జెప్పడానికి యత్నించాడు. నాయనా, నీకూ, నీ శిష్యగణానికీ మేం తిండి పెట్టలేమా? అని గద్గద స్వరంతో ప్రశ్నించాడు. బుద్ధుడు భిక్షమెత్తడం మా సంప్రదాయం అన్నాడు. మన పూర్వులెవరూ భిక్షాటన చేయలేదుగదా? అన్న తండ్రి ప్రశ్నకు బదులు చెబుతూ సిద్ధార్థుడు "మీరు రాజవంశంలో జన్మించారు. నేను బుద్ధుల పరంపరలో ఒకడుగా జన్మించాను. వారంతా భిక్షాటనతోనే జీవన యాత్ర సాగించారు" అన్నాడు. అంతటితో ఆగక నడివీధిలో నిలబడి సందేశమిస్తూ.

"చాలు నాలస్యమికనైన మేలుకొనుడు
పాపమార్గాన్ని వీడి పావనులు కండు
ఇహపరమ్ముల ధార్మికుండెచ్చటయిన
అవ్యయమ్మైన ఆనందమనుభవించు."

అని ప్రబోధించాడు. శుద్ధోదన మహారాజు కొద్ది క్షణాల పాటు ఈ ధార్మిక భావానందాన్ని బుద్ధుని పవిత్ర భిక్షాపాత్రను స్వీకరించి ఆయననూ, శిష్యగణాన్ని ప్రాసాదానికి తీసుకెళ్లి ఇష్టమృష్టాన్నాలతో షడ్రసోపేతమైన భోజనాన్ని పెట్టించాడు. భోజనానంతరం శుద్ధాంత కాంతలంతా వచ్చి బుద్ధునికి అభివందనాలర్పించారు. కానీ, యశోధర వారితో కలిసి భగవానుని దర్శించలేదు. "నాస్వామి దృష్టిలో నాకు ఏ కొంచెం విలువున్నా ఆయనే నా దగ్గరకు వచ్చి నా అభివందనాలు స్వీకరిస్తాడు" అనుకుంది. ఆమె మనోభావాలను గ్రహించిన బుద్ధుడు ఇద్దరు శిష్యులతో యశోధర గృహానికి స్వయంగా వెళ్లి తన కోసం ఏర్పాటు చేసిన ఆసనాన్ని అధిష్ఠించాడు.

యశోధర హర్షానంద పులకితగాత్రయై పరుగు పరుగున వచ్చి ఆయన కాళ్లను చేతులతో చుట్టేసుకుని పాదాల మీద తలవాల్చి భక్తి పారవశ్యంతో

ప్రణతులర్పించింది. కొడుకు రాహులు నుద్దేశించి నాయనా ఈయనే మీ తండ్రి, వచ్చి నీ వారసత్వ ఆస్తి ఇవ్వమని అడుగు మన్నది. రాహులుడు బుద్ధుని ముందు నిలబడి వినమ్రుడై "భిక్షూ ! మీ నీడ ఆనందమయమైంది." అన్నాడు. బుద్ధుడు ఆసనం నుంచి లేచి దూరంగా వెళ్ళాడు. రాహులుడు "భిక్షూ, నా దాయభాగం ఇవ్వండి" అని ఆయనను వెంబడించాడు. అప్పుడు బుద్ధుడు తన ప్రధాన శిష్యునితో "సారిపుత్రా! ఈ బాలునికి సంఘ ప్రవేశం కల్పించు" అన్నాడు. అప్పటి నుంచే రాహులుడు భిక్షువుల్లో చేరిపోయాడు.

ఈ పరిణామంలో సంతప్తహృదయుడైన శుద్ధోదనుడు బుద్ధుని దగ్గరకు వెళ్లి, అభివందన మాచరించి ఒక వరం అర్థించాడు. "సిద్ధార్థుడు సంసారాన్ని పరిత్యజించడమే నాకు చాలా బాధ కలిగించింది. నందుడు అదే మార్గాన్ని అవలంబించడం నన్ను క్రుంగదీసింది. చివరకు రాహులుడు కూడా భిక్షువు కావడం నాకు అమిత మనస్తాపం కల్గించింది. పుత్ర, పౌత్ర ప్రేమానుబంధాలు చాలా బలీయమైనవి. కాబట్టి తల్లిదండ్రుల అనుమతిలేకుండా కుమారులకు దీక్ష ఇవ్వరాదని ఆదేశించండి." ఇది శుద్ధోదనుని అభ్యర్థన. బుద్ధుడు దాన్ని ఆమోదించాడు.

బుద్ధుడు కపిలవస్తుపురంలో ఉన్న కాలంలో చాలా మంది శాక్య రాజకుమారులు సంఘంలో చేరారు వారిలో బుద్ధుని జ్ఞాతులయిన ఆనందుడు, దేవదత్తుడు కూడా ఉన్నారు. ఆ తర్వాత ఆనందుడు సన్నిహిత సహచరుడు కాగా, దేవదత్తుడు ప్రధాన ప్రత్యర్థి అయ్యాడు. బుద్ధుని కపిలవస్తు సందర్శనం తర్వాత నాలుగేళ్లకు శుద్ధోదనుడు మరణించాడు.

## అనాథపిండకుని పరివర్తనం

ఆరోజుల్లో శ్రావస్థిలో అనాథ పిండకుడనే ధనిక వణిక్ ప్రముఖుడుండేవాడు. ఆతడు రాజగృహలో తన స్నేహితుని ఇంట్లో ఉండగా లోకానికి సద్ధర్మం బోధించే బుద్ధుని గురించి విన్నాడు. ఒకనాడు వేకువ జామునే అనాథ పిండకుడు

బుద్ధుడున్న చోటికి వెళ్ళి, ఆయన బోధనలు ఆలకించి బౌద్ధ ధర్మం స్వీకరించడమే కాక సంఘానికి భూరి విరాళం కూడా ఇచ్చాడు. శ్రావస్తిలో తన ఇంటికి వచ్చేట్లు బుద్ధునితో వాగ్దానం కూడా తీసుకున్నాడు. ఇంటికి తిరిగి వెళ్లాక అనాథపిండకుడు భారీ మూల్యం చెల్లించి జేతవనాన్ని కొని అందులో బుద్ధుని కోసం మనోహరమైన కుటీరాన్ని కట్టించాడు. దాని చుట్టూ ప్రధాన భిక్షువుల కోసం ఎనిమిది కుటీరాలు ఏర్పాటు చేయించాడు. వాటితో పాటు విశాలమైన గదులున్న మరికొన్ని ఆరామాలూ, అందమైన జలాశయాలూ నిర్మించి, అన్నివసతులు సమకూర్చినట్లు బుద్ధునికి వర్తమానం పంపించాడు. బుద్ధుడు రాజగృహనుంచి బయలుదేరి కొన్ని రోజుల్లో శ్రావస్తి చేరుకున్నాడు. అనాథపిండకుడు బంధుమిత్ర కుటుంబ పరివారసమేతంగా ఎదురేగి సాదరంగా స్వాగతం పలికి ఆహ్వానించాడు. బుద్ధుడు నిరుపమాన తేజో గాంభీర్య ముద్రతో తనకోసం నిర్మించిన జేతవనారామంలో ప్రవేశించాడు. ఆ కుటీర ఆరామ సముదాయాన్ని సంఘానికి దానంగా ఇవ్వాలన్న అనాథపిండకుని ఆకాంక్షనూ అభ్యర్థనను తథాగతుడు ఆమోదించాడు. శ్రావస్తిగరంలోనే విశాఖ అనే ప్రముఖ మహిళ ఉండేది. ఆమె పుణ్యావర్ధనుడన్న సంపన్న వ్యాపారి భార్య. ఆమె సంఘ అభిమానిగా, పోషకురాలుగా మారడమేకాక, దిగంబర జైన ధర్మానుయాయి అయిన తన మామగారిని కూడా బౌద్ధ ధర్మానుయాయిగా మార్చింది. అనాథ పిండకుడు నిర్మించిన ఆరామం తర్వాత విలువలో, వైభవంలో దానికి దాదాపు దీటైన పూర్వారామాన్ని సంఘానికి దానంగా విశాఖ అర్పించింది.

## నదీజల వివాద పరిష్కారం

సిద్ధార్థుడు బుద్ధుడుగా మారిన ఐదేళ్ల తర్వాత వైశాలి సమీపంలోని మహారణ్యంలో నివసించాడు. ఆ సమయంలో శాక్యులకూ, కొలియులన్న మరో క్షత్రియ వర్గానికీ మధ్య రోహిణీ నదీ జలాల విషయంలో తీవ్రవివాదం ఏర్పడింది. ఆ ఏడు సంభవించిన దారుణక్షామ పరిస్థితుల వల్ల రోహిణీ నదీ జలాలు సాగు భూమికి సరిపోలేదు. తత్ఫలితంగా ఉభయ క్షత్రియ వర్గాలూ నీటి కోసం ఘర్షణకు

సన్నద్ధమయ్యాయి. ఆ సందర్భంలో నదీ తీరంలో గుమికూడిన రాజవంశీకులను అక్కడికి వాహ్యాళికి వచ్చిన బుద్ధుడు ఆ కోలాహలానికి హేతువేమిటని అడిగాడు. రోహిణీ జలాల కోసం యుద్ధానికి తలపడిన వర్గాలను ఆ నీటి విలువెంత అని ప్రశ్నించాడు. చాలా స్వల్పమన్నారు. అలాగే భూమి విలువ గురించి అడిగితే అది కూడా అత్యల్పమేనన్నారు. ఆమీదట బుద్ధుడు రాజవంశీకుల, ఇతర యోధుల రక్తం విలువెంత అని ప్రశ్నించాడు. దానికి విలువ కట్టలేమన్నారు ఉభయులూ. అలాంటప్పుడు అత్యల్పమైన వాటికోసం అనల్పమూ అమూల్యమూ అయిన రక్తాన్ని ధారబోస్తారా? అన్నాడు బుద్ధుడు. ఈ ప్రశ్నలతో వారి ఆవేశం, ఉద్రేకం చల్లబడ్డాయి. వివేకవంతమైన ఆయన సలహాను అంగీకరించి రాజీపడ్డారు. ఆయన జ్ఞానానికి ముగ్ధులై వారిలో చాలా మంది సంఘంలో చేరారు.

## స్త్రీలకు సంఘ ప్రవేశ సమస్య

శుద్ధోధనుడు తీవ్ర వ్యాధిగ్రస్తుడై మంచం పట్టాడని తెలిసి బుద్ధుడు కపిలవస్తుపురం వెళ్లి తండ్రిని కడసారి సందర్శించి సర్వం అనిత్యం, అశాశ్వతం, జీవితం క్షణ భంగురమన్న సత్యాన్ని పునరుద్ఘాటించాడు. శుద్ధోదనుడు ప్రశాంతచిత్తుడై, అర్హతుడై జీవయాత్ర ముగించి నిర్వాణం పొందాడు.

భర్త మరణానంతరం మహారాణి ప్రజాపతి గౌతమి భిక్కుని కావాలని నిర్ణయించుకుని శిరోముండనం చేయించుకుని బుద్ధుని దగ్గరికి వెళ్లింది. అప్పటికే సంఘంలో చేరిన శాక్య వంశీకుల భార్యలు చాలా మంది ఆమెననుసరించారు. శుద్ధోదనుడు గతించాక, నందుడూ, రాహులుడు భిక్షువులుగా మారాక తాను ఏకాకిగా ఉండిపోదలుచుకోలేదనీ, తననూ, తనతో వచ్చిన ఇతర మహిళలనూ సంఘంలో చేర్చుకోవాలని ప్రజాపతి గౌతమి అభ్యర్థించింది. బుద్ధుడు మూడుసార్లు ఈ విన్నపాన్ని తిరస్కరించాడు. స్త్రీలకు సంఘ ప్రవేశం కల్పిస్తే అపరిణత మనస్కులయిన భిక్షువులకు చిత్త చాంచల్యం కలుగవచ్చుననీ సంఘాన్ని గురించి ఇతరులకు చెడుగా, చులకనగా మాట్లాడే అవకాశం ఏర్పడుతుందని ఆయన భావించాడు. ఆ తర్వాత బుద్ధుడు అక్కడ నుంచి వైశాలి సమీపంలోని కూటాగార పర్వతానికి వెళ్లిపోయాడు.

ఏమైనా సరే సంఘంలో చేరి తీరాలన్న తిరుగులేని నిర్ణయానికి వచ్చిన ప్రజాపతి గౌతమి, ఇతర శాక్య స్త్రీలు కాషాయవస్త్రాలు ధరించి, మృణ్మయ భిక్షా పాత్రలతో కాలినడకన కపిల వస్తునుంచి వైశాలికి ప్రయాణించారు. అంతవరకూ అంతఃపుర సౌధాల నుంచి కిందికి దిగని అసూర్యం పశ్యలయిన రాజకుటుంబాల రమణీ సమూహం ముళ్లూ రాళ్లూ కొల్లలుగా ఉన్న కాలిబాటల్లో నడుస్తూ సాయంకాలానికి బుద్ధుడున్న కుటీరానికి చేరుకుంది. భిక్షువు ఆనందుడు ఆమహిళా సమూహానికి ఎదురేగి ఆహ్వానించాడు. ధూళి ధూసరితమై, రక్తం స్రవిస్తున్న పాదాలతో నీరసించిన ఆసుకుమార మూర్తుల దైన్యస్థితిని చూసిన ఆనందుని హృదయం కరుణారసార్ద్రమైంది. కళ్లు కాసారాలయ్యాయి. వారి ఆగమన కారణాన్ని తెలుసుకొని ఆ విషయాన్ని బుద్ధునికి నివేదించాడు.

బుద్ధుడు అదంతా ఆలకించాక ఇలా అన్నాడు. "ఇకచాలు ఆనందా! స్త్రీలు కూడా గార్హస్త్యజీవితం వదిలి, తథాగత ధర్మాన్ని, సంఘనియమాలనూ పాటిస్తూ అనికేతనలై జీవించాలని మాత్రం కోరవద్దు, అన్నాడు. ఇలా ముమ్మారునిరాకరించినా ఆనందుడు తన పట్టు వదల్లేదు. 'గృహస్థ ధర్మాన్ని వీడి అనికేతునలైన స్త్రీలు ధార్మిక జీవన ఫలం పొంది అర్హత్వాన్ని సాధించడానికి అర్హులు, సమర్థులు కారా భగవాన్" అని భావోద్వేగంతో ప్రశ్నించాడు. బుద్ధుడు ఈ విషయంలో స్త్రీల అర్హతను, సామర్థ్యాన్ని కాదనలేకపోయాడు. "లోకంలో బుద్ధులు పురుష జనోద్ధరణకే ఉద్భవిస్తున్నారా?" అని కూడా ఆనందుడు ప్రశ్నిస్తూ, స్త్రీ పురుష విచక్షణ లేకుండా మానవులందరి సముద్ధరణార్థమే బుద్ధులు జన్మిస్తున్నారన్న తన విశ్వాసాన్ని కూడా ఆనందుడు ఉద్ఘాటించాడు. చివరకు బుద్ధుడు స్త్రీల సంఘ ప్రవేశానికి అనుమతించాడు. అయితే ఆ మహిళలు సోదర భిక్షువులకు విధేయులై ఉండాలంటూ అందుకోసం ఎనిమిది నిబంధనలు విధించాడు. స్త్రీల సంఘ ప్రవేశం వల్ల ఉత్పన్నమయ్యే అవరోధాల గురించి వ్యాఖ్యానిస్తూ" సంఘంలో స్త్రీలు చేరకుండా ఉంటే సద్ధర్మం వెయ్యేళ్లు వర్ధిల్లేది. కానీ, ఇప్పుడు అది అయిదువందల ఏళ్లే మనగలుగుతుంది" అన్నాడు. "బలమైన ఆనకట్టలేనిదే జలాశయం నిలబడదు, అందువల్లనే సంఘ సంరక్షణార్థం ఎనిమిది నిబంధనల అడ్డుకట్టలను నిర్మిస్తున్నాను.

వాటిని ఎవరూ ఉల్లంఘించకూడదు" అని ఆదేశించాడు. సిద్ధార్థుడు బుద్ధుడైన ఆరేళ్లకు ఈ ఉదంతం జరిగింది.

## బుద్ధుని ఆచార్యత్వం

బుద్ధుడు సంఘాన్ని ఎలా నిర్వహించాడో తెలియజేసే సంఘటనా పరంపరను పిటకాలు వివరిస్తాయి. అయితే ఆయా సంఘటనల క్రమం ఏమిటి? అన్న విషయాలను అవి తెలియజేయవు. పిటకాల సంకలన కర్తలు బుద్ధుని బోధనలతో సంబంధం ఉన్న సంఘటనల పట్ల మాత్రం చాలా శ్రద్ధవహించారు. ఆయన జీవితానికి సంబంధించిన ఇతర సంఘటనల పట్ల బొత్తిగా ఆసక్తి చూపలేదు. సంఘాన్ని స్థాపించి ధర్మాన్ని బోధించడమే బుద్ధుని లక్ష్యం. దానికే పిటకాలు ప్రాముఖ్యం ఇచ్చాయి. ఆయన ఎప్పుడు ఏయే ప్రాంతాల్లో సంచరించాడు? జీవితంలో ఎలాంటి కష్టనష్టాలను అనుభవించాడు? అన్న దాన్ని పిటకాలు పట్టించుకోలేదు. అయినా ఆ వివరాల్లో ఎక్కువభాగం మనకు దక్కకుండా పోలేదు.

నాలుగు దశాబ్దాలపాటు బుద్ధుడు కోసల, మగధ, అంగరాజ్యాల్లో సంచరించాడు. రాజధాని నగరాలయిన రాజగృహ (నేటి బీహారులోని రాజఘర్), శ్రావస్తి (నేటి సాహెబ్‌మెహత్) లను తరుచుగా సందర్శించాడు. రాజకీయాల్లో, ఇతర లౌకిక విషయాల్లో ఆయన బొత్తిగా ఆసక్తి చూపలేదు. కానీ, రాజకుటుంబాలూ, సంపన్న వర్గాలూ ఆయనను ఎంతో గౌరవించి ఆదరించాయి. బ్రాహ్మణులు, నవయువకులు భిక్షువులుగా మారడం మింగుడుపడని పెద్ద మనుషులు మాత్రం బుద్ధుని పట్ల విముఖత చూపారు. ప్రశాంతమూ, గతిశీలమూ, గంభీరమూ, ధీరోదాత్తమైన బుద్ధుని ఏకాంత దయార్ద్ర జీవితానికి సంబంధించిన చారిత్రక సంఘటనల వివరాలు నిర్దిష్టంగా కాకపోయినా వాటి రూపురేఖలు మాత్రం స్పష్టంగానే లభించాయి. బుద్ధుని తొలిశిష్యులు అన్ని ఋతువుల్లోనూ దేశాటన చేశారు. పరివ్రాజకులు సంవత్సరంలో ఎక్కువ కాలం పర్యటించాలని, వర్షర్తువులో మాత్రం మూడు మాసాలు ఒకేచోట విశ్రాంతి తీసుకోవచ్చుననే సంప్రదాయం అప్పటికే ఉంది.

దాన్నే వర్షావాసమనేవారు. బౌద్ధ భిక్షువులు కూడా ఈ నియమాన్ని పాటించాలని బుద్ధుడు ఆదేశించాడు. బుద్ధుడు దేశ సంచారం చేసేప్పుడు రోజుకు ఐదు నుంచి పదిమైళ్లవరకూ నడిచేవాడు. మధ్యాహ్న భోజనానికి భిక్షకు వెళ్లాలి కాబట్టి ఆసమయానికి ఏదో ఒక ఊరు చేరుకొనే విధంగా అనుదిన కార్యక్రమం నిర్ధారించుకొనేవాడు. మధ్యాహ్నకాలాన్ని ఆయన ధ్యానానికి కేటాయించుకునేవాడు. సాధారణంగా ఆయన గ్రామాలకు, పట్టణాలకు వెలుపల అడవుల్లో, వనాల్లో, నదీ తటాకాల ఒడ్డున విడిదిచేసేవాడు. ఈ పర్యటనల్లో బుద్ధునితో చాలా మంది శిష్యులు వెళ్లేవారు. బుద్ధుని బోధనలకు సంబంధించిన సూత్రాలు, ఏ ప్రాంతాల్లో ఆ చర్చలు జరిగాయో వాటి పరిసరాల వర్ణనలతో మొదలవుతాయి. ఆయన రాజగృహ, నలందల మధ్య రహదారిలో ప్రయాణిస్తున్నా, కోసల రాజ్యంలో సంచరిస్తూ చిరావతీ నదీ తీరంలోని మామిడి తోటలో బసచేసినా, బ్రాహ్మణ గ్రామపరిసరాల్లో ఉన్నా ప్రజానీకం బుద్ధుని దర్శించడానికి తరలి వెళ్లేది. బ్రాహ్మణ ప్రముఖులు గుంపులుగా వెళ్లుతున్న జనాన్ని మిద్దెల పై నుంచి చూసి విషయం తెలుసుకుని తాము వెళ్లి బుద్ధుని చూడాలా? లేక ఆయనే మొదట తమ వద్దకు రావాలా? అని చర్చించు కొనేవారు. అయితే తుదకు వారే ఆయన వద్దకు వెళ్లేవారు. చంపా పక్కన గగ్గర సరోవర తీరంలో సువాసనలు వెదజల్లే తెల్లని పూలు పూసిన చంపక వృక్షాల కింద బుద్ధుడు కూర్చొనేవాడు. మరొకప్పుడు రాజగృహకు ఎగువన ఉన్న కొండల్లో ఉండేవాడు. నెమళ్లు ఎక్కువగా సంచరించే ఆ కొండలను దేశద్రిమ్మరులైన సన్యాసులు తరుచు సందర్శించేవారు. బుద్ధుడు చాలా వరకు యాత్రికుల కోసం నిర్మించిన విశ్రాంతి గృహాల్లో విడిది చేసేవాడు. అయితే కాలం గడిచే కొద్దీ అభిమానులు బుద్ధుని కోసం ప్రత్యేకంగా విశ్రాంతి గృహాలు నిర్మించారు. ఆయన జీవితకాలంలోనే అవి ఆరామాల స్థాయికి చేరుకున్నాయి. వైశాలి ప్రజలు ఆయనకోసం నగరానికి ఉత్తరాన అడవిలో ఒక విశ్రాంతి గృహాన్ని నిర్మించారు. శాక్యులు కపిల వస్తులో 'శాంతాగార' మనే పేరుతో నూతన భవనాన్ని కట్టించారు. కానీ, అనాథ పిండకుడు సంఘానికి సమర్పించిన జేతవనం అన్నిట్లో బాగా ప్రసిద్ధికెక్కింది. బౌద్ధ ధార్మిక సాహిత్యంలో




గాందారశైలిలో తథాగతుని రూపం



సిద్ధార్థుని జననం మాయాదేవి కపిలవస్తు నుంచి తన పుట్టిల్లు దేవదహ వెళ్లేటప్పుడు మార్గమధ్యంలోని లుంబినీ వనంలో సిద్ధార్థునికి జన్మనిచ్చుట.



మహాభి నిష్క్రమణ సిద్ధార్థుడు అనికేతనుడై సత్యాన్వేషణకు రాజ ప్రాసాదము వదిలి వెళ్లే దృశ్యం.



సిద్ధార్థుని జ్ఞానోదయం మహాయానానికి పూర్వం బుద్ధుని రూపానికి పర్యాయంగా ధర్మచక్రం, వజ్రాసనం, బోధివృక్షం, స్తూపం మొదలైన చిహ్నాలనే ప్రదర్శించేవారు.



ధర్మచక్ర ప్రవర్తన పంచవర్గీయ భిక్కులకు బుద్ధుడు మొదటిసారిగా మృగదావనంలో ధర్మ బోధన చేసిన చిత్రం

★ అమరావతి శిల్పానికి రేఖాచిత్రాలు



కుశినారలో బుద్ధుని మహాపరి నిర్వాణం
బుద్ధుడు భిక్షువుల నుద్దేశించి పలికిన తుది పలుకులు
"ఆత్మదీపం, ఆత్మశరణం, అనన్యశరణం, ధర్మదీపం, ధర్మశరణం."
అజంతా శిల్పానికి రేఖాచిత్రం

దాని ప్రస్తావన ఎక్కువగా అగుపిస్తుంది. బింబిసారుడు రాజగృహలోని తన విహార వనమైన వేణు వనాన్ని సంఘానికి అప్పగించాడు.

బుద్ధుడు సూర్యోదయానికి ముందే నిద్రలేచి భిక్షాటనకు వెళ్లే వరకూ ధ్యానంలో గడిపేవాడు. అనంతరం భిక్షాపాత్రతో శిష్యసమేతంగా ఊరంతా తిరిగేవాడు. భిక్షాపాత్రలో ఎవరేది వేసినా స్వీకరించేవాడు. ఆయన నడుస్తున్నప్పుడు కూడా శిష్యులతో ధార్మిక విషయాలు చర్చించేవాడు. అప్పుడప్పుడు భిక్షాటన జరుపకుండా భోజనానికి ఎవరైనా ఆహ్వానిస్తే శిష్యులతో పాటు వెళ్లేవాడు. భోజనానంతరం ధార్మిక విషయాలపై ప్రశ్నోత్తరాల రూపంలో బుద్ధుని ప్రవచనాలు సాగేవి. ఆయన రోజుకు ఒకసారే మధ్యాహ్నానికి కొంచెం ముందు భోంచేసేవాడు. భోజనానంతరం శిష్యులతో సంభాషణ ముగిశాక తన కుటీరానికి వచ్చేవాడు. లేదా బయటనే నీడలో విశ్రమించేవాడు. తర్వాత సాయంకాలం వరకూ ధర్మ బోధనలు ఉండేవికావు. బౌద్ధ ధర్మానుయాయులంతా బుద్ధుని ఎంతో గౌరవించేవారని పిటకాలు తెలియజేస్తాయి. బుద్ధుడు ఇతరులతో సంభాషించేటప్పుడు పవిత్రవాతావరణం, ఆరాధనాభావం ఆ పరిసరాలంతా వ్యాపించేవి. అయితే ఈ ఆరాధనా భావం మితిమీరి వ్యక్తం కావడం ఆయనకు ఇష్టం ఉండేది కాదు. అతిగా జరిగే ప్రశంసలను బుద్ధుడు మృదువుగా, వ్యంగ్యంగా ఆక్షేపించేవాడు. మీకంటే మహాజ్ఞాని, గురువు గతంలో వర్తమానంలో లేడనీ భవిష్యత్తులో ఉండబోడనీ నా నమ్మకమని సారిపుత్రుడు బుద్ధునితో అన్నప్పుడు వారిద్దరి మధ్య సంభాషణ ఇలా సాగింది.

"సారిపుత్రా గతంలో వచ్చిన బుద్ధులంతా నీకు తెలుసా?"

"తెలియదు భంతే"

"రాబోయే బుద్ధుల గురించి తెలుసా?"

"అదీ తెలియదు భంతే"

"అయితే నాగురించి నీకు బాగా తెలిసినట్లుంది. నామనసు లోలోతులకు వెళ్లి పరిశీలించినట్లుంది"

"లేదు భంతే, మీ గురించి కూడా నాకు పూర్తిగా తెలియదు"

"అలాంటప్పుడు సారిపుత్రా! అంత సాధికారంగా, గొప్పగొప్ప మాటలెలా చెప్పగలిగావు?"

బుద్ధుడు సంఘానికి అభిమానులు సమర్పించే ఆహారం, వస్త్రాలు, తోటలు, గృహాల వంటి కానుకలను ఆమోదించేవాడు. కానీ లాంఛనపూర్వకమైన అట్టహాసాలను అంగీకరించేవాడు కాదు. బోధి రాకుమారుడు బుద్ధుని ఆగమన సందర్భంలో భవనమంతా తెల్ల తివాచీలు పరిపించాడు. కానీ, బుద్ధుడు ఆ తివాచీల మీద నడవడానికి నిరాకరించి వాటిని తీసి వేసేవరకు భవన ద్వారం బయటనే నిలబడ్డాడు.

బుద్ధుని కార్యక్రమాల్లో శిష్యులకు జ్ఞానబోధ ఇతర సంఘ వ్యవహారాలు ప్రధాన పాత్ర వహించాయి. ఎవరేది చెప్పినా వినడానికీ ఎవరికైనా బోధించడానికీ ఆయన ఎప్పుడూ సిద్ధమే. కానీ, పిటకాల ద్వారా తెలిసే సమాచారం మేరకు ఆయన విశేషంగా జనాన్ని ఆకర్షించి ఉపదేశాలు ఇచ్చినట్లు అగుపించదు. తన శిష్యులకూ, సత్యాన్ని తెలుసుకోవాలన్న జిజ్ఞాస నిజంగా ఉన్న వాళ్ళకూ బోధించడానికే ఆయన ఎక్కువ కాలాన్ని వినియోగించినట్లు విదితమవుతుంది. మీరు కొంతమందికి ప్రత్యేక శ్రద్ధాసక్తులతో సమధికోత్సాహంతో బోధించడానికి కారణమేమిటని ఒక వ్యక్తి బుద్ధుని ప్రశ్నించాడు. దానికి సమాధానం ఇస్తూ ఆయన ఇలా అన్నాడు. "ఒక రైతుకు మూడు రకాలయిన పంట పొలాలు ఉంటే అందులో ఎక్కువ సారవంతమైన పొలాన్ని మొదట, మధ్య తరహా భూమిని ఆతర్వాత, పశుగ్రాసానికి మాత్రమే పనికి వచ్చే భూమిని చివరలో సాగుచేస్తాడు. అలాగే బుద్ధుడు మొదట భిక్షువులకూ ఆ తర్వాత సాధారణ విశ్వాసులకూ బోధిస్తాడు. తక్కువ రకానికి చెందిన పొలాన్ని రైతు చివరలో సాగుచేసినట్లు బ్రాహ్మణులకూ, ఇతర ధార్మిక శాఖలకు చెందిన సన్యాసులకూ, తన బోధనల్లో ఒకమాట అర్థం చేసుకున్నా వాళ్లకు అది ఎంతో ఉపయోగకరమని భావించి చివరలో బోధిస్తాడు."

తన అనుచరులకు బోధనలో బుద్ధుడు ప్రముఖ శిష్యుల సహకారం తీసుకునేవాడు. అలాంటి సహాయకుల్లో సారిపుత్రుడు, మౌద్గల్యాయనుడూ ముఖ్యులు. ఈ ఇద్దరూ సంజయుని శిష్యరికం వదలి సంఘంలో చేరినవాళ్లు. సారిపుత్రుడు బుద్ధునికి చాలా అభిమాన పాత్రుడు. ఆయన బుద్ధుని సాధికార ప్రతినిధి హోదాలో బౌద్ధధర్మానికి ముఖ్యమైన వ్యాఖ్యలు చేశాడు. వివరణలు ఇచ్చాడు. శాక్యులకు క్షుర కర్మచేసే ఉపాలి కూడా సంఘంలో చేరాక బుద్ధునికి సన్నిహితుడై వినయ పిటకాన్ని క్రోడీకరించాడు. అతను సమాజంలో తక్కువస్థాయికి చెందినా, బౌద్ధ సంఘంలో ఉన్నత స్థాయికి చేరుకోవడానికీ, బుద్ధునికి సన్నిహితం కావడానికీ అదేమీ అవరోధం కాలేదు.

సంఘ నిర్వహణలో బుద్ధునికి సమస్యలు కూడా ఎదురవుతుండేవి. భిక్షువుల మధ్య వివాదాలు ముదిరి తగాదాలుగా మారినప్పుడు బుద్ధుని జోక్యంతో తుదకు పరిష్కారమవుతూ ఉండేవి. ఒకసారి ఇలాంటి తగాదా విషమించింది. ఈసారి ఆయన జోక్యం ఫలించలేదు. ఒక భిక్షువు ఎదురు తిరిగి "భగవాన్, మీరు ఈ జీవితంలో సాధించిన అలౌకిక ఆనందం అనుభవిస్తూ ఈ గొడవలకు దూరంగా ఉండడం మంచిది. అదే బుద్ధులకు బాగుంటుంది. ఈ సమస్యలు మాకు వదిలెయ్యండి" అని నిష్ఠూరంగా మాట్లాడాడు. పదే పదే ఆదేశించి నా ఫలితం లేకపోవడంతో, ఈ మూర్ఖులు నిజంగానే విచక్షణా జ్ఞానరహితులయ్యారని భావించి బుద్ధుడు తన ఆసనం వదిలి వెళ్లిపోయాడు. ఈ విషయం గ్రంథాల్లో ఉల్లేఖితమైంది.

బుద్ధునికి ఎదురైన సమస్యల్లో దేవదత్తుని శత్రువైఖరి ప్రధానమైంది. అతడు బుద్ధునికి దగ్గరి బంధువు. ఆనందుడూ మొదలయిన శాక్యులతో పాటు సంఘంలో చేరాడు. దేవదత్తుడు మగధ యువరాజైన అజాత శత్రువుకు మిత్రుడు కూడా. యువరాజు అండతో బుద్ధుని సంఘ ఆధిపత్యం నుంచి తప్పించి ఆ స్థానాన్ని తాను ఆక్రమించాలని దేవదత్తుడు ప్రయత్నించాడు. భిక్షువులకు మరింత కఠినమైన నిబంధనలు విధించాలని వాదించాడు. బుద్ధుడు సంఘ ఆ ధిపత్యం నుంచి వైదొలగి విశ్రాంతి తీసుకోవాలని బహిరంగంగా ప్రకటించాడు.

యువరాజైన అజాతశత్రువును బింబిసారుని హత్యకు సైతం దేవదత్తుడు ప్రేరేపించాడు. బింబిసారునిపై జరిగిన హత్యాయత్నాన్ని మంత్రులు భగ్నం చేసినా కొడుకు దురాశను గ్రహించిన బింబిసారుడు ఐచ్ఛికంగా రాజ్యాధికారాన్ని త్యజించాడు. అయినా మహాక్రూరుడైన అజాతశత్రువు తండ్రిని నిర్బంధంలో ఉంచి, పస్తులతో మాడ్చి చంపేశాడు. అజాతశత్రువు మగధ రాజయ్యాక దేవదత్తుడు బుద్ధుని హత్యకు కుట్రచేశాడు. మొదట ఆ పనికి హంతకులను నియమించాడు. కానీ, బుద్ధుని చూడగానే ఆ హంతకుల మనసులు మారిపోయాయి. ఆ తర్వాత దేవదత్తుడే స్వయంగా కొండపై నుంచి పెద్ద బండను ఆయన మీదికి దొర్లించాడు. కానీ, అది గురితప్పి చిన్నశకలం తగిలి కాలికి గాయమైంది. తుదకు భిక్షార్థం వెళ్లినప్పుడు ఒక మదపుటేనుగును ఆయన మీదికి పురికొల్పించాడు. కానీ బుద్ధుని ప్రశాంత, ప్రసన్న వ్యక్తిత్వం ముందు ఆ మత్త గజం కూడా తలవంచింది. ఈ దుష్ప్రయత్నాలన్నీ విఫలమయ్యాక దేవదత్తుడు నెత్తురు కక్కుకుని దుర్మరణం పాలయ్యాడు.

ఇంకో సందర్భంలో కొందరు అన్యమతస్థులు సుందరి అనే సన్యాసినిని ప్రలోభపెట్టి బుద్ధునితో తనకు అక్రమ సంబంధం ఉన్నట్లు చెప్పించారు. ఆ తర్వాత వారే ఆమెను హత్యచేయించి బౌద్ధ భిక్షువులే తమ గురువు పాపాన్ని కప్పిపుచ్చేందుకు ఆమెను చంపించినట్లు ప్రచారం చేశారు. కానీ, అసలు హంతకులు తమకు ముట్టిన డబ్బుతో తప్పతాగి ఆమత్తులో వాస్తవాన్ని తామే బయటపెట్టారు.

ఇలాంటి కొన్ని ఘటనలు మినహా మొత్తం మీద బుద్ధుని జీవితం శాంతియుతంగా, స్నేహార్ద్రంగా గడిచింది. ఈ విశ్వానికి సృష్టికర్త ఎవరూ లేరనీ, శాశ్వతమైన ఆత్మ అనేది ఏదీలేదనీ, వైదిక కర్మకాండలు నిరర్థకము అనీ బుద్ధుడు అసందిగ్ధంగా ప్రకటించాడు. ఈవిధంగా ఆనాడు మౌలికంగా పూర్తిగా భిన్నమైన మార్గాన్ని ప్రబోధించినా ఆయన జీవితం శాంతియుతంగా సాగడం ఆశ్చర్యకరంగానే అగుపిస్తుంది. వైదిక కర్మకాండలను తీవ్రంగా ఖండించినా

వాటిని పాటించే వారి పట్ల బుద్ధుడు మృదువుగా వ్యవహరించాడు. వారి మనోభావాలను కించపరచకుండా జాగ్రత్త వహించాడు. బ్రాహ్మణుల పవిత్ర అగ్నిహోత్రం ముందు కూర్చుని వారితో చర్చలు జరిపేవాడు. కానీ ఆ కర్మకాండను మాత్రం తూలనాడేవాడు కాదు. లిచ్ఛవుల సేనాని శిహాను, బుద్ధుడు జైన ధర్మం నుంచి బౌద్ధ ధర్మానికి మార్చాడు. అయితే శిహా తన ఇంటికి వచ్చే జైన భిక్షువులను పూర్వం లాగే ఆదరించాలనీ, ఆతిథ్యమివ్వాలనీ కానుకలు ఇవ్వాలనీ బుద్ధుడు ఆదేశించాడు. దీన్నిబట్టి అన్య ధర్మాల పట్ల ఆయన సహన భావం వ్యక్తమవుతుంది. తన మీద హత్యాయత్నాలు చేసిన దేవదత్తునికి అజాతశత్రువు అండదండలు ఉన్నాయని తెలిసినప్పటికీ బుద్ధుడు ఆ విషయాన్ని పట్టించుకోకుండా రాజగృహకు వెళ్లివస్తూ ఉండేవాడు. అజాతశత్రువుకు అత్యుత్తమ ధార్మిక సందేశం ఇచ్చాడు కూడా. ఆయన సంకల్పశక్తి అజేయమైంది. నిరుపమానమైంది. భయానికి ఆయన మనస్సులో స్థానమేలేదు. తప్పు చేసిన వాళ్లను దండించే విషయంలో మృదువుగా వ్యవహరించడంలో తనకు తానే సాటి. ఇతరుల దోషాలను ఎత్తి చూపేవాడు కాదు. "ఇతర గురువులు చెప్పేది తప్పో, ఒప్పో పట్టించుకోకు. నామాట విను. నేను నీకు సత్యాన్ని బోధిస్తాను" మరణశయ్యపై నుండి కొత్త సంఘంలో చేరిన ఒక భిక్షువుకు బుద్ధుడు ఇచ్చిన సందేశం ఇది. వివాదాస్పద విషయాలను ప్రస్తావించదల్చుకున్నప్పుడు ఆయన పాత పదాలు ప్రయోగిస్తూనే వాటికి నూతనార్థాలు కల్పించేవాడు. ఆయన బ్రాహ్మణులను నిందించకుండానే జ్ఞానమూ, నైతిక సమగ్రత కలిగిన వాడే నిజమైన బ్రాహ్మణుడన్నాడు. పాపకర్మలకు పాల్పడకుండా, సత్యాన్ని అనుసరించడమే నిజమైన యజ్ఞమన్నాడు.

'ధమ్మపదం'లో బ్రాహ్మణుని గురించి ఎంతో ఉదాత్తంగా వ్యాఖ్యానించాడు.

"ధ్యాని రజోగుణ రహితుడు
జ్ఞాని మహాస్థిరచిత్తుడు
మాలిన్యం లేనివాడు

కృతకృత్యుండుత్తముడే
బ్రాహ్మణుడంటాను నేను".

స్త్రీలకు బుద్ధుడు వారి శక్తి సామర్థ్యాలకూ, ప్రవృత్తికీ తగిన స్థానం కల్పించాడు. చాలా ముఖ్యమైన సంఘ పోషకుల్లో విశాఖ కూడా ఒకరు. ఒకసారి కోసల రాజుతో బుద్ధుడు ధార్మిక విషయాలపై సంభాషిస్తుండగా ఒక పరిచారిక వచ్చి రాణి మల్లిక ఆడ శిశువును ప్రసవించిందని రాజు చెవిలో చెప్పింది. ఆవార్త రాజుకు సంతోషం కలిగించలేదు. కొడుకు పుట్టి ఉంటే ఆయన ఆనందించి ఉండేవాడు. ఈ విషయాన్ని గమనించిన బుద్ధుడు ఇలా అన్నాడు.

"రాజా! కొందరు స్త్రీలు పురుషుల కన్నా ఉన్నతులు ఈ పాపను ప్రేమతో పెంచండి విజ్ఞానం, సౌశీల్యం మూర్తిభవించిన స్త్రీలు ఎందరో ఉన్నారు. వాళ్లు అత్తను దేవతలా గౌరవిస్తారు. అలాంటి సుగుణాల రాశి కడుపున మహా పరాక్రమవంతుడైన పురుషుడు జన్మించి సువిశాల సామ్రాజ్యాన్ని నిర్మించి సమర్థంగా పాలిస్తాడు."

తన జీవితపు చివరి సంవత్సరంలో ఆయన ఆమ్రపాలి అనే వేశ్యతో కలసి భోంచేశాడు. బుద్ధుడు ఆమ్రపాలితో కాకుండా తమతో కలిసి భోంచేయాలని వైశాలి రాజకుమారులు ప్రయత్నించి విఫలులయ్యారు. స్వయంగా రాజకుమారుడైన బుద్ధుని సాటి రాజకుమారుల ఆహ్వానం ఆకర్షించలేక పోయింది.

## చివరి మజిలీ

వైశాలి నుంచి బుద్ధుడు పొరుగునే ఉన్న 'బెలువ' అనే గ్రామానికి వెళ్లి చివరి రోజులు అక్కడే గడిపాడు. అక్కడే ఆయన తీవ్రవ్యాధి గ్రస్తుడయ్యాడు. కానీ, తాను తనువు చాలించవలసిన తరుణమింకా రాలేదనీ, అదీ గాక సంఘం నుంచి వీడ్కోలు తీసుకోకుండా వెళ్లిపోవడం సముచితం కాదని తథాగతుడు భావించాడు. అసాధారణ సంకల్ప బలంతో ఆయన వ్యాధిని అణచిపెట్టి, తాను నిర్ణయించుకున్న కాలం సమీపించే వరకూ ప్రాణాలపై పట్టును నిలబెట్టుకున్నాడు.

వ్యాధి నుంచి కోలుకున్నాక, బుద్ధుడు కుటీరం నుంచి బయటికి వచ్చి కూర్చున్నాడు. అప్పుడు ఆనందుడు ఆయన దగ్గరికి వచ్చి నమస్కరించి

"తథాగతుడు రుజాగ్రస్తుడు కావడం చూసి నాదేహం వాడిన తీగలాగ బలహీనమైంది. దిజ్మండలం తేజోవిహీనమైనట్లు అగుపించింది. మనసు అయోమయంలో పడింది. కానీ, తథాగతుడు సంఘానికి అంతిమ సందేశం ఇవ్వకుండా వెళ్లడనే ఆలోచన నాకు కొంత ఉపశమనం కలిగించింది." అన్నాడు. దానిపై బుద్ధుడు "ఆనందా! సంఘం నానుంచి ఏమి ఆశిస్తోంది? నేను ఏమీ దాపరికం లేకుండా సత్యాన్ని బోధించాను. తథాగతుడు ఏ సత్యాన్నీ గుప్పిట్లో మూసి పెట్టలేదు. సంఘం తన మీదనే ఆధారపడి ఉందనీ తానే సంఘాన్ని నడుపుతాననీ భావించే వ్యక్తి మాత్రమే సంఘానికి సంబంధించిన విషయాల మీద ఆదేశాలిస్తాడు. తథాగతుడు సంఘం తన మీదనే ఆధారపడి ఉందని అనుకోవడం లేదు. అలాంటప్పుడు సూచనలు ఎందుకివ్వాలి?" అని ప్రశ్నించాడు.

"ఆనందా నేను వృద్ధుడినయ్యాను. వయసు పైబడింది. నా జీవన యాత్ర ముగింపు దగ్గరలోకి వచ్చింది. చివరి దినాలకు చేరుకున్నాను. శిథిలావస్థలో ఉన్న బండి కట్టుడు తాళ్లు బిగింపు మీద నడిచినట్లు తథాగతుని దేహం కూడా కేవలం ఔషధాల బలంమీద ఆధారపడింది. అందుచేత అనందా! మీకు మీరే దీపాలు కండి. ఇతరుల ఆశ్రయం మీద ఆధారపడకుండా మీకు మీరే ఆశ్రయంగా వర్ధిల్లండి. సత్యాన్ని దీపంగా చేసుకోండి. సత్యాన్నే ఆశ్రయించండి. ధర్మాన్ని దీపంగా చేసుకోండి ధర్మాన్నే ఆశ్రయించండి". (అత్తదీప, అత్తశరణ, అనన్నశరణ, ధమ్మదీప, ధమ్మశరణ అని పాళీ భాషలో బుద్ధుడు చేసిన ప్రభోధం అదే)

బుద్ధుడు ఆనందునితో కలిసి కపాలమందిరం వరకూ నడిచి వెళ్లుతూ తనకు మరణం ఆసన్నమైందని అన్నాడు. మూడు మాసాల్లో తథాగతుడు అస్తమించనున్నాడన్న వదంతి జనంలో వ్యాపించింది. బుద్ధుడు ఆనందునితో కలిసి కూటాగార ఆరామానికి వెళ్లాడు. అక్కడ చేరిన భిక్షువుల నుద్దేశించి ప్రసంగిస్తూ తనకు రాబోయే మరణాన్ని గురించి ఇలా ప్రకటించాడు.

"భిక్షువులారా! తథాగతుని అస్తమయం సమీపించింది. నేటి నుంచి మూడు నెలలు పూర్తికాగానే తథాగతుడు మరణిస్తాడు."

**అంతిమ భిక్ష**

ఒక మధ్యాహ్నం బుద్ధుడు నగరం వైపు పరికించి "తథాగతుడు వైశాలినిచూడడం ఇదే కడసారి. ఆనందా! భండగ్రామం వెళ్దాంరా" అన్నాడు. మూడు మజిలీల తర్వాత 'పావ' చేరుకుని చుందుని మామిడితోటలో బసచేశాడు. కమ్మరి పని చేసే చుందుడు వారిని భిక్షకు ఆహ్వానించి మధురాన్నం, రొట్టెలూ, పుట్టగొడుగుల కూర వడ్డించాడు. (ఈ విషయం మీద రెండు రకాలైన అభిప్రాయాలున్నాయి. కొంతమంది చుందుడు బుద్ధునికి వడ్డించినది అడవిపందిమాంసమని కూడా చెబుతారు). బుద్ధుడు మధురాన్నం, రొట్టెలు భిక్షువులకు వడ్డించమని చెప్పి పుట్టగొడుగుల కూరమాత్రం వారికి వద్దని వారించారు. తనకే వడ్డించుకున్నాడు. దాన్ని తాను కొంతతిని మిగిలింది పూడ్చిపెట్టమన్నాడు. చుందుని ఇంట్లో భోంచేసి వెళ్ళాక బుద్ధునికి తీవ్రమైన విరేచనాలు పట్టుకున్నాయి. ఆ బాధను ఆయన తనలోనే భరించాడు. బాధ కొంచెం ఉపశమించాక ఆనందునితో కుసినార పోదాం రమ్మన్నాడు. అలాగే భంతే అని ఆనందుడు ఆయనను అనుసరించాడు.

దారిలో బుద్ధుడు కాకుస్థ నదిలో స్నానంచేసి అలసటతో ఒకచెట్టు నీడలో ఆనందుడు పరిచిన వస్త్రం మీద మేను వాల్చాడు. గతంలో అలారకలామ వద్ద శిష్యరికం చేసిన పుర్కుసుడనే యువకుడు బుద్ధుని కలిసి, ఆయన మాటలు విని శిష్యుడుగా మారి ఒక బంగారు వస్త్రాన్ని బహూకరించాడు ఆసమయంలోని తథాగతుని దేహకాంతి ముందు ఆయన కప్పుకున్న వస్త్రం వెలవెలబోయింది. జ్ఞానోదయమైన రాత్రి, మరణానికి ముందు రాత్రి - ఈ రెండు సందర్భాల్లో మాత్రమే బుద్ధుని శరీరం అలా ప్రకాశిస్తుందని గౌతముడు వివరించాడు.

హిరణ్యావతీ నదికి ఆవతలిగట్టున ఉన్న మల్లుల సాలవనానికి వెళ్దాం రమ్మని బుద్ధుడు ఆనందుని పిలిచాడు. అక్కడికి చేరాక రెండు సాలవృక్షాల మధ్యన

ఉత్తరాభిముఖంగా తల్పం సిద్ధం చేయమన్నాడు. దాని మీద కుడివైపు తిరిగి కాలు మీదకాలు వేసుకుని శయనించి అంతర్ముఖుడయ్యాడు. అది వసంత ఋతువు కాకపోయినా ఆ వనంలో వృక్షశాఖల నిండా పూలు విరబూశాయి, దివ్వ సంగీతంతో, అద్భుత పరిమళాలతో వాతావరణం నిండిపోయింది. అగోచర శక్తులు తథాగతుని పానుపు చుట్టూ చేరాయి. ఆనందుడు ఆ వనంలోని విహారంలోకి వెళ్లి కరుణామయుడైన గురువును కోల్పోతున్నందుకు దుఃఖించసాగాడు. బుద్ధుడు ఆనందుని పిలిపించి - "దుఃఖించవద్దు, మనకు అత్యంత ప్రియమైన వాటికి మనం దూరం కావడం, వాటిని మనం కోల్పోవడం వస్తువుల స్వాభావిక లక్షణమని నేను నీకు చెప్పలేదా? పుట్టిన, అస్తిత్వంలోకి వచ్చిన ప్రతిదానిలోను, సంయోగికమైన ప్రతిదానిలోను విచ్ఛిన్నావశ్యకత లోపలే నిక్షిప్తమై ఉంటుంది. అలాంటిది నశించకుండా ఎలా ఉంటుంది".

ఏదీ శాశ్వతంకాదు. "ఆనందా! చాలాకాలంగా నీవునాకు ఎంతో సన్నిహితంగా ఉంటున్నావు. నన్ను ఎంతో ప్రేమతో ఆదరించావు. చిత్తశుద్ధితో కృషిచేస్తే నీవుకూడా ఇంద్రియాసక్తి, అహం, మోహం, అవిద్య అనే మహా దోషాల నుంచి త్వరలో విముక్తి చెందుతావు" అని ఊరడించాడు. అటవీ మధ్యలో ఉన్న ఈ కుగ్రామంలో కాకుండా ఏదైనా పెద్దనగరంలో దేహత్యాగం చేయాలని ఆనందుడు బుద్ధుని ప్రార్థించాడు. ఈ కుశినార గ్రామం ఒకప్పుడు మహాసుదర్శన రాజు పాలనలో రాజధాని నగరంగా ఎంతో వైభవాన్ని సంతరించుకుందని దాని గత ప్రశస్తిని గురించి బుద్ధుడు ఆనందునికి వివరించాడు.

కుశినార మల్లుల రాజధాని. మల్లులు కూడా శాక్యులు, వజ్జీయులలాగే గణతంత్ర విధానాన్ని అనుసరించారు. బుద్ధుని ఆదేశం మేరకు ఆనందుడు సభామందిరానికి వెళ్లి ప్రజలను పిలిచి "తథాగడుతు మా ఊళ్లో మరణించినా, ఆయన అంత్యకాలంలో మేము ఆ మహనీయుని దర్శించలేక పోయామని మీరు ఆత్మనిందచేసుకొనే దుస్థితి రానీయకండి." అని హెచ్చరించాడు. అప్పుడు మల్లులు కుటుంబ పరివార సమేతంగా బుద్ధ దర్శనం చేసుకున్నారు. విరబూసిన చెట్ల నీడన మృత్యుశయ్యమీద ఉన్న తథాగతునికి వారంతా పాదాభివందనం చేసి

తుది వీడ్కోలు ఇచ్చారు. సుభద్రుడనే అన్యధర్మావలంబియైన ఒక సన్యాసి కూడా బుద్ధ దర్శనానికి వచ్చాడు. ఆనందుడు ఆ యతిని దూరంగా పంపాలని ప్రయత్నించాడు. ఆ సంగతి గ్రహించిన బుద్ధుడు "సుభద్రుని దూరంగా పంపవద్దు. ఆతడు జ్ఞానతృష్ణతోనే నన్ను ప్రశ్నిస్తాడు. నన్ను వేధించాలనీ, సాధించాలనీకాదు. నా సమాధానాలను కూడా అతడు త్వరగా అర్థం చేసుకుంటాడు'' అన్నాడు. బుద్ధునితో తుది ఉపదేశం పొందిన చిట్టచివరి వ్యక్తి సుభద్రుడే. అతడు నేరుగా అర్హతుడయ్యాడు.

రాత్రి చివరి జాములో తథాగతుడు ఆనందునితో ఇలా అన్నాడు. "ఆనందా! ఇక బుద్ధుని పలుకులు వినబడవు. మీలో కొందరు ఇక మనకు గురువు లేరని భావించవచ్చు. కానీ అది తప్పు. నేను బోధించిన సత్యాలూ, విధించిన నియమనిబంధనలే మీకు కాంతి పథం చూపుతాయి. నేను మరణించాక మీరు పరస్పరం ఇప్పటిలాగా మిత్రమా అని సంబోధించుకోవద్దు. వయసులో పెద్దవారయిన భిక్షువులు చిన్నవారిని పేరుతో కానీ, మిత్రమా అని కానీ పిలువవచ్చు. కానీ, పిన్నలు పెద్దలను గౌరవపూర్వకంగా 'భన్తే' అని సంబోధించాలి' అన్నాడు. కమ్మరి చుందుని భిక్ష తీసుకున్నాక తథాగతుడు మరణించాడన్న కారణంతో అతడిని ఎవరూ నిందించకూడదు. గౌతమునికి జ్ఞానోదయమై బుద్ధుడయ్యాక సమర్పించిన మొదటి భోజనం, ఆతడు మరణించేముందు పెట్టిన తుది భోజనం ఈ రెండూ ఉత్తమమైనవి. అందుచేత చుందుడు అపరాధ భావంతో కుమిలి కుంగిపోవలసిన అవసరం లేదు'' అని కూడా బుద్ధుడు ఆనందునితో అన్నాడు.

తథాగతుడు జన్మించిన, మరణించిన స్థలాలూ, అతనికి జ్ఞానోదయమైన చోటూ, ధర్మచక్రప్రవర్తన మొదలైన తావు - ఈ నాలుగు స్థలాలు బౌద్ధభిక్షువులకు పవిత్రక్షేత్రాలని బుద్ధుడు సూచించాడు. భిక్షువులనుద్దేశించి చేసిన తుది ప్రసంగంలో ఆయన ఇంకా ఇలా అన్నాడు. "ధర్మమార్గాల గురించికానీ, సంఘ సమస్యల గురించికానీ సోదర భిక్షువుల కెవరికైనా సందేహాలు ఉండవచ్చు. తథాగతుడు ఉన్నప్పుడు వాటిని నివృత్తి చేసుకోలేకపోయామే అని తర్వాత విచారించ కుండా ఇప్పుడే నిస్సంకోచంగా అడగండి''.

ఎవరూ ఏమీ అడుగక పోవడంతో ఆనందుడు ఇలా వ్యాఖ్యానిస్తూ "ఈ సభలో సందేహాలు ఉన్న భిక్షువు ఒక్కడు కూడా లేడు. ఇది అద్భుతమైన విషయం" అన్నాడు. బుద్ధుడు ఆనందునితో ఏకీభవిస్తూ "ఈ అయిదువందల మంది భిక్షు సోదరుల్లో అందరికన్నా వెనుక బడిన భిక్షువు కూడా మళ్లీ బాధావహమైన జన్మ ఎత్తబోడు. అతనికి అర్హత్వం లభించి తీరుతుంది." అని స్పష్టం చేశాడు. ఆ తర్వాత మరోసారి భిక్షువులను సంబోధిస్తూ పంచస్కందాలతో కూడిన ప్రతిదీ నశిస్తుందనీ సంయోగికాలకు నశించడం స్వాభావిక లక్షణమని అన్నాడు. శ్రద్ధగా ధర్మాన్ని ఆచరించి నిర్వాణాన్ని సాధించాలని చెప్పాడు. ఈ అంతిమ వాక్యాల తర్వాత బుద్ధభగవానుడు అన్ని సమాధి దశలూ గడిచి మహాపరి నిర్వాణం చెందాడు.

అనిరుద్ధుడనే అర్హతుడు బుద్ధుని నిర్వాణంపై ప్రశంసా ప్రస్తావనలో నిశ్చలచిత్తుడైన మహాజ్ఞాని మహాపరి నిర్వాణంపొందాడనీ ఆయనలో మరణవేదనకు అణుమాత్రం కూడా చోటులేదనీ అన్నాడు. ఆనందుడు తీవ్రంగా చలించిపోయాడు. యువభిక్షువులు బాధాసంతప్తహృదయాలతో ప్రపంచజ్ఞానచక్షువు మూతబడిందా అని ఆక్రోశించారు. నేలమీదదొర్లుతూ ఎలుగెత్తి విలపించారు. వృద్ధభిక్షువులు వారిని ఓదార్చుతూ సంయోగిక వస్తుజాలమంతా నశించిపోయేదే అని గుర్తుచేశారు.

బుద్ధుని మరణవార్తను ఆనందుడు వినిపించగానే మల్లులు "ఇంతలోనే తథాగతుడు అస్తమించాడా? ఇంత త్వరగా ప్రపంచంనుంచి వెలుగు వెళ్ళిపోయిందా' అంటూ బిగ్గరగా విలపించారు.

బుద్ధుని భౌతిక కాయానికి దహన సంస్కారం జరిగాక అస్థికలను కపిలవస్తు శాక్యులూ, కుశినారమల్లులూ, పవ మల్లులూ, వైశాలి లిచ్ఛవులూ, అల్లకప్ప బులియాలూ, రామగ్రామ కొలియులు, మగధరాజా అజాతశత్రువు, వేతదీప బ్రాహ్మణులు పంచుకున్నారు. పంపిణీచేసిన ద్రోణుడనే బ్రాహ్మణుడు దహనం చేయడానికి ఉపయోగించిన లోహపేటికను తీసుకున్నాడు. ఆలస్యంగా అస్థికల కోసం వచ్చిన పిప్పలవన మొరియులకు చితాభస్మం మాత్రమే లభించింది. వీటిమీద పది స్థూపాల నిర్మాణం జరిగింది.

అసాధారణ బౌద్ధిక నైతిక శక్తులు మూర్తీభవించిన ఒక మహోన్నత మనీషి అపూర్వ జీవన యాత్ర అలా పరిసమాప్తి చెందింది.

## బౌద్ధధర్మం

క్రీస్తుకు పూర్వం ఆరవ శతాబ్దం చరిత్రలో విశేష ప్రాముఖ్యం వహిస్తోంది. ప్రపంచంలోని అనేక ప్రాచీన సమాజాల్లో ఈ కాలంలోనే నూతన తాత్విక, ధార్మిక దృక్పథాల ఆవిష్కారం జరిగింది. చైనాలో లావోట్జు, కన్ఫ్యూషియస్, గ్రీసులో పెర్మనైడ్స్, ఎంపెడోక్లిస్, పర్షియాలో జరాతుష్ట్ర, భారత వర్షంలో గౌతమ బుద్ధుడు, వర్ధమాన మహావీరుడూ లాంటి పురుషోత్తములు ఉద్భవించారు. ప్రజానీకానికి తాత్విక, ధార్మిక రాజనైతిక విషయాల్లో పథ ప్రదర్శనం చేసిన బోధకులు ఈ సమాజాల్లో ఎందరో అగుపిస్తారు, క్రీస్తుకు పూర్వం ఆరవ శతాబ్దం నాటికే బీహారుకు పశ్చిమాన వైదిక సంస్కృతి పట్టు సాధించింది. అయినప్పటికీ బీహారులో మాత్రం ఆ సంస్కృతి వేళ్ళూను కోలేదు. సిద్ధార్థ గౌతముని యవ్వన దశలో బీహారులో పరివ్రాజకులైన తాత్వికులు చాలామంది ఉండేవారు వారిలో అత్యధికులు నిరీశ్వరవాదులు. వారు ఆనాటి సామాజిక జీవితానికి సంబంధించిన అనేక తీవ్రనైతిక, బౌద్ధిక వైరుధ్యాలను ఎత్తిచూపారు. కానీ అదే సమయంలో దేవుని అస్తిత్వాన్ని నిరాకరించిన ఆ తాత్వికులు పునర్జన్మ సిద్ధాంతాన్ని గట్టిగా విశ్వసించారు. భిన్నకాలాల్లో కొందరు మానవోత్తములు భూమిమీద ప్రబోధకులుగా అవతరిస్తారనీ, క్రమశిక్షణతో కూడిన నైతిక జీవిత మొక్కటే సత్ఫలితాలనిస్తుందనీ వాళ్లు నమ్మారు. గౌతమ బుద్ధునికి పూర్వం కూడా బుద్ధులు భూమిమీద జన్మించి సత్యాన్ని బోధించారనీ గౌతముడు ఆ సత్యాన్నే మళ్లీ దర్శించాడనీ త్రిపిటకాలు చెబుతున్నాయి. మానవాళి విముక్తికి ఒకే ఒక మార్గం ఉందనీ, భిన్న కాలాల్లో కొందరు జ్ఞానులు మాత్రమే దాన్ని దర్శించి అందరికీ బోధించగలరనీ అవి ఘోషిస్తున్నాయి. నిరుపమానమైన బుద్ధుని మహోన్నత వ్యక్తిత్వం భారతీయుల హృదయాల మీద అద్వితీయమైన ముద్రవేసింది. ఏ ధర్మప్రబోధకుడుగానీ, చక్రవర్తిగానీ జనమానసాలను అంతగా కదిలించలేదు. బుద్ధుని బోధనలు వైదిక

ధర్మానికీ, తాత్విక చింతనకూ చెందిన సకల శాఖలనూ ఎంతో ప్రభావితం చేశాయి. భారతీయ కళా, సాహితీ సంస్కృతులు దేశ సరిహద్దులనుదాటి ఇతర దేశాలకు వ్యాపించడానికి బౌద్ధధర్మం విశేషంగా దోహదం చేసింది. ఆ విధంగా సద్ధర్మాన్ని సకల మానవాళికీ బోధించాలన్న బుద్ధుని సంకల్పం ఫలించింది.

## చతురార్య సత్యాలు

నిత్య నిరంతర పరివర్తన శీలమూ, జన్మపరంపరకు హేతుభూతమైన ప్రపంచాన్ని ప్రజ్ఞాచక్షువులతో దర్శించిన బుద్ధుడు, ఆత్మశాశ్వత మన్న వైదిక సిద్ధాంతాన్ని నిరాకరించాడు. ఆత్మ అన్నది లేదని కూడా స్పష్టం చేస్తూ మానవుల విముక్తికి నాలుగు ఆర్య సత్యాలను ప్రవచించాడు. దుఃఖం, దుఃఖహేతువు, దుఃఖోపశమనం, దుఃఖోపశమన మార్గం - వీటినే చతురార్య సత్యాలంటారు. బౌద్ధ ధర్మానికి ఇవి మౌలిక, అవిచ్ఛిన్న అంశాలు. ఆనాటి సమాజంలో బహుళంగా వ్యాప్తిలో ఉన్న కర్మకాండలనూ, తాత్విక ఊహాపోహలనూ, అంధ విశ్వాసాలనూ, శరీర శోషణనే ముక్తిమార్గంగా భావించే సాధనలనూ బౌద్ధ ధర్మం తిరస్కరించింది.

అస్తిత్వమే - జన్మమే - దుఃఖమయమన్నది చతురార్య సత్యాల్లో ప్రథమ సత్యం, సంయుత్త నికాయంలో ఇది చాలా భావనాత్మకంగా అభివ్యక్తమైంది. ఆ ప్రసంగం ఇలా బోధిస్తుంది. "శిష్యులారా! జన్మ పరంపరకు కారణమైన ఈ సంసార చక్రానికి ఆద్యంతాలు అంతుబట్టనివి. జీవులు జన్మించడం, అజ్ఞానంతో తృష్ణాపాశాలలో చిక్కి పథభ్రష్టమై పరితపించడం, అనాదిగా జరుగుతూనే ఉంది. తల్లి మృతి, బిడ్డల చావు, బంధువులను కోల్పోవడం, ఆస్తి నష్టం, అనారోగ్యం - ఇవన్నీ తరతరాలుగా, యుగయుగాలుగా మానవజాతి అనుభవిస్తున్నవే. ఈ కష్టనష్టాలను భరిస్తూ అప్రియమైన వాటికి చేరువై, ప్రియమైన వాటికి దూరమై, కుమిలిపోతూ, విలపిస్తూ సుదీర్ఘజీవయాత్రలో దారిదప్పి సంచరిస్తున్న దీన మానవులు కార్చిన కన్నీరు మున్నీటి జలాలనే మించిపోయింది."

ప్రపంచంలోని చెడును గురించి చెప్పే సమయంలో బుద్ధుడు జీవితం అనిత్యం, అస్థిరమనే విషయాన్ని నొక్కి వక్కాణించాడు. అయినా జీవితం ప్రధానమైందనే ఆయన భావించాడు. "నరజన్మ దుర్లభం, సద్ధర్మాన్ని వినే అవకాశం లభించడమూ కష్టమే." మానవ జన్మెత్తి పాపకర్మలకు పాల్పడేవాడు భయానకమైన నికృష్టజన్మల వలయంలో చిక్కి, సత్యాన్ని గ్రహించలేని ధ్యేయరహితమైన జంతు సంతతిలో చేరుతాడు. జీవిత అస్థిరత్వాన్ని, అశాశ్వతత్వాన్ని, స్వతస్సిద్ధ సత్యంగా బుద్ధుడు పరిగణించాడు. జరారుజా మరణాల వంటి పరిష్కార రహితమైన మానవ జీవిత సమస్యల గురించి, అప్రియమైన వాటికి చేరువ కావడం, ప్రియమైన వాటికి దూరంకావడం వల్ల కలిగే దుఃఖం గురించి ఆయన తరుచు ప్రస్తావించేవాడు. మనం కోరుకున్న దాన్ని పొందలేకపోవడం, ఆశలను నెరవేర్చుకోలేక పోవడం, మానవ జీవితంలోని మరో చెడు లక్షణం. కానీ శాశ్వతత్వం కోసం ఆరాట పడడం మానవ నైజం. అపరివర్తన శీలమూ, స్వతస్సిద్ధంగా నిరాపేక్షమైన విలువ గలదీ అయిన దాన్ని పొందాలని మానవుడు అభిలషిస్తాడు. కానీ ఏ లోకంలోనూ అది అలభ్యం. కేవలం ఒక్క నిర్వాణంలోనే మనం తృష్ణను జయించి అనిశ్చితత్వాన్ని అధిగమించగలం.

ద్వితీయ ఆర్యసత్యం : ఇది దుఃఖ కారణాన్ని వివరిస్తుంది. సుఖాపేక్ష, కామ వాసనాభరితమైన తృష్ణే పునర్భవానికి మూల కారణమని బుద్ధుడు బోధించాడు. విస్తృతార్థంలో తృష్ణ అంటే జీవన కాంక్ష. జీవన చక్ర పరిభ్రమణానికి హేతుభూతమైన సుఖలాలస, మరణోన్ముఖుడైన మనిషి అస్తిత్వం కోసం పడే తాపత్రయం - ఇవే పునర్భవానికి దోహదం చేస్తాయి. ధన కాంక్ష, అధికార కాంక్ష, ఈ జీవిత పరిమితుల్లోనే అత్యున్నత స్థాయి నందుకోవాలన్న తహతహ. వీటన్నిటి సమ్మిశ్రమ రూపమే తృష్ణ.

ఈ తృష్ణ స్వభావమేమిటి? దాని కార్య సరళి ఎలా ఉంటుంది? వీటికి సమాధానం తెలుసుకోవాలంటే మొదట కార్యకారణాలకు సంబంధించిన ప్రతీత్య సముత్పాద నియమాలను పరిశీలించాలి. ఇవి అతి పురాతనమైన, అత్యంత

ప్రసిద్ధి గాంచిన సంక్లిష్ట బౌద్ధ తాత్విక సూత్రాలు. ప్రాధాన్యతా క్రమంలో ఈ సూత్రాలు చతురార్య సత్యాల తర్వాత స్థానాన్ని ఆక్రమిస్తాయి. సిద్ధార్థుడు బోధివృక్షం కింద వీటినే ధ్యానించాడు. ప్రతీత్య సముత్పాద సిద్ధాంతం ప్రకారం అవిద్య నుంచి సంస్కారాలు కలుగుతాయి. ఆ సంస్కారాల నుంచి చేతన, దాని నుంచి నామరూపాలు, వాటి నుంచి ఆరు ఆయతనాలూ (ఇంద్రియ ప్రదేశాలు), ఆయతనాల నుంచి స్పర్శ, దాని నుంచి సంవేదన, ఆ సంవేదన నుంచి తృష్ణ తృష్ణ నుంచి బంధం, దాని నుంచి అస్తిత్వం, అస్తిత్వం నుంచి జన్మ, జన్మ నుంచి జరామరణాలూ, బాధ, పరిదేవనం, దుఃఖం, నిస్పృహ కలుగుతాయి. దుఃఖావిర్భావ క్రమమిదే. కానీ నిష్కామం ద్వారా అవిద్యను అంతంచేస్తే దానితో పాటు సంస్కారాలు కూడా నశిస్తాయి. సంస్కారాలు నశించడంతో చేతన నశిస్తుంది. ఇలా ఒక్కొక్కటి నశిస్తూ చివరకు దుఃఖాంతమవుతుంది. ఈ క్రమాన్నే ద్వాదశ నిదానాలని కూడా అంటారు. ద్వితీయ, తృతీయ ఆర్య సత్యాల విస్తరణే ఈ ప్రతీత్య సముత్పాద నియమం, పంద్రెండు నిదానాల్లో మొదటి రెండు - అనగా అవిద్య, సంస్కారాలు గతానికి చెందినవి. అవి ప్రస్తుత అస్తిత్వానికి కారణాలను వివరిస్తాయి. తరువాతి ఎనిమిది నిదానాలు అస్తిత్వాన్ని విశ్లేషిస్తాయి. ఈ పది నిదానాలు పోగా మిగతా రెండు (అనగా జన్మ, జర) భవిష్యత్తుకు చెందినవి. వాంఛల ప్రభావం భావిజన్మ మీద ఎలా ఉంటుందో ఆ రెండు నిదానాలు తెలియజేస్తాయి. క్లుప్తంగా చెప్పాలంటే జీవనకాంక్ష ఒక జన్మ పరిమితుల నధిగమించి పునర్భవం ద్వారా వ్యక్తమవుతూంటుంది.

సంస్కారాలకు కారణమైన ఈ అవిద్య ఏమిటి? చతురార్య సత్యాలు తెలియక పోవడమే అవిద్య. అస్తిత్వంలోకి వచ్చిన ప్రతిదానికీ అంతం తప్పని సరి అని తెలియకపోవడమే అవిద్య. వస్తువుల యధార్థ స్వభావాన్ని గురించి, దుఃఖహేతువైన తృష్ణ గురించి తెలియక పోవడమే అవిద్య. గత జన్మలోని మన అవిద్య కారణంగా, మరణ సమయంలో మనలో ఉన్న అస్తిత్వాకాంక్ష ఫలితంగా మనమీలోకంలో జన్మించాం. మన దుస్థితికి కారణాలను అర్థం చేసుకొని తొలగించుకొనక పోతే దుఃఖ ముక్తి లభించదు.

## ఆర్య అష్టాంగ మార్గం

నాలుగవ ఆర్యసత్యం దుఃఖో పశమనానికి ఆచరణాత్మక మార్గాన్ని సూచిస్తుంది. అదే సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ వాక్కు, సమ్యక్ కర్మ, సమ్యక్ జీవనం, సమ్యక్ కృషి, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి అనే అష్టాంగ మార్గం. ఇందులో విధి నిషేధాలేమీ లేవు. ముక్తి పొందడానికి ఏమేమి అవసరమో ఈ మార్గం సరళశైలిలో బోధిస్తుంది. పరిశుద్ధ జీవితాన్ని దైవభావంతో, మానవాతీత శక్తులతో ముడివేయడాన్ని ఖండించడం ద్వారా, మానవునికి ఎదురయ్యే సుఖదుఃఖాలకు అతడే బాధ్యుడని బోధించడం ద్వారా ఇది ఒక విశిష్టతను సంతరించు కుంది. దుఃఖాన్ని నిర్మూలించడానికి దోహదంచేసే పవిత్ర మార్గమే అష్టాంగ మార్గం. అయితే అది అంతిమ లక్ష్యం కాదు. ఆనందాన్ని అందుకొనే మార్గం మాత్రమే.

సమ్యక్ దృష్టి అంటే చతురార్య సత్యాలకూ, వాటి అనుబంధ విషయాలకూ సంబంధించిన జ్ఞానం. తాత్విక సిద్ధాంతాలతో దీనికి ఎలాంటి సంబంధం లేదు. బుద్ధుడు తాత్విక సిద్ధాంత రాద్ధాంతాలను పట్టించుకోలేదు. బౌద్ధ ధార్మిక సూత్ర పరిజ్ఞానం ఉంటే చాలునని భావించాడు.

జీవిత సత్యాన్ని గురించి అవగాహన లేక పోవడమంటే చతురార్య సత్యాల గురించి తెలియక పోవడమేనని అర్థం. ఈ సత్యాలను తెలుసుకోక పోవడం వల్లనే జీవకోటి పునర్భవ చక్రంలో చిక్కుతుంటూంది.

"భిక్షువులారా! చతురార్య సత్యాలను, అర్థం చేసుకోనందువల్లనే, వాటిని సునిశితంగా అధ్యయనం చేయనందు వల్లనే మనమీలోకంలో, పునర్భవ చక్రంలో పరిభ్రమిస్తున్నాం. ఈ నాలుగు ఆర్యసత్యాలను లోతుగా పరిశీలించి అవగాహన చేసుకుంటే పునర్భవానికి దోహదం చేసే అస్తిత్వాకాంక్ష నశిస్తుంది. ఇక జన్మించడ మంటూ వుండదు." ఇది తథాగతుని ప్రబోధం.

ఇంద్రియ సుఖ భోగ విలాస లాలసను పరిత్యజించాలనీ, ద్వేషభావాన్ని విసర్జించాలనీ, ఎవరికీ ఏ విధమైన హానిచేయకూడదని దృఢంగా నిశ్చయించు కోవడమే సమ్యక్ సంకల్పం. వస్తువుల వాస్తవ స్వరూపాన్ని యథాతథంగా

దర్శించడం, వాటిని గురించి సరైన అభిప్రాయాలు ఏర్పాటు చేసుకోవడం సమ్యక్ సంకల్పానికి దోహదం చేస్తాయి. ఇంద్రియలోలత్వం, ద్వేషం, ఇతరులకు హాని కలిగించడం సమ్యక్ సంకల్పానికి పూర్తిగా వ్యతిరేకమైనవి. సహనంతో, దృఢదీక్షతో ఈ అవలక్షణాలను అధిగమించడానికి కృషి చేయవలసి ఉంది.

"భిక్షువులారా! ఇంద్రియ సుఖభోగాలు క్షణికమైనవి. తుచ్ఛమైనవి. బూటకమైనవి. అవాస్తవమైనవి. శ్రేయోదాయకం కాని ఆలోచనలు దురాశకూ, ద్వేషానికీ, ఘర్షణకూ దారితీస్తాయి."

సమ్యక్ వాక్కు అంటే అసత్యం చెప్పకపోవడం, పరుషంగా మాట్లాడక పోవడం, వ్యర్థ ప్రలాపాలకు పాల్పడకపోవడం.

క్రోధం, దురాశ, అసూయ, గర్వం, స్వార్థం లాంటి దుర్గుణాలు వాక్కుమీద పెత్తనం వెలిగించకూడదు. వాగాడంబరం సత్క్రమ ఆలోచనలకు అవరోధమై ప్రశాంతతకు ప్రమాద హేతువవుతుంది.

"భిక్షువులారా వాగాడంబరం వల్ల చాలా నష్టాలున్నాయి. అనవసరంగా, అతిగా మాట్లాడే వ్యక్తి అసత్యాలు పలుకుతాడు. పరనిందకూ, కర్కశ వ్యర్థాలాపాలకు పాల్పడుతాడు."

మాటల్లో కాఠిన్యం లేకుండా ప్రతి ఒక్కరూ జాగ్రత్త పడాలి.

"నాలుకను కత్తిగా మార్చినట్టి వాడు
పరుష వాక్కులు నిత్యము పల్కు వాడు
పరుల ద్వేషించి ఎవడు రాపాడు వాడు
చివరకా కత్తి దెబ్బకే చిక్కుతాడు."

అందుచేత మైత్రిని తుంచి శత్రుత్వాన్ని పెంచి పోషించే వాక్ పారుష్యానికి ఎవరూ పాల్పడకూడదు. ఉబుసుపోక చెప్పుకొనే కబుర్లు చాలా హీనమైనవి. జ్ఞాన సముపార్జనకు నష్టదాయకమైనవి. "భిక్షువులారా! మీరు కలుసుకున్నప్పుడు చేయదగినవి రెండే రెండు. ధమ్మం గురించి మాట్లాడండి. లేదా మౌనంగా ఉండండి."

టిబెట్టుకు చెందిన ఒక యోగ గ్రంథం ఇలా చెబుతుంది.

"పక్షులు ఆకాశంలో
స్వేచ్ఛగ విహరించుతాయి
మాట్లాడే రామచిలుక
మగ్గును పంజరములోన
ఆపదలకు వాచాలుడు
ఆత్మబంధు వనిపించును
దురదృష్టమునైన మౌని
దూరంగా ఉంచుతాడు".

సమ్యక్ కర్మ అంటే జీవహింస చేయక పోవడం, చౌర్యానికీ, అవినీతికీ పాల్పడక పోవడమే. మనసును అదుపులో ఉంచేందుకు సాధన చేయాలి. అదుపులేని మనస్సు ఏదో ఒక సాకుతో దోషాచరణకు ఉపక్రమిస్తుంది. సచ్ఛీలాన్ని ఎవరూ ఇంకొకరికి కానుకగా బహూకరించ లేరు. ఎవరికి వారే స్వయంకృషితో వివేచన ద్వారా, చింతన ద్వారా, శ్రద్ధతో, జాగరూకతతో దాన్ని సాధించుకోవాలి. ఈ కృషిలో నిత్యజాగరూకత అత్యవసరం, అనివార్యం.

శీల నిర్మాణానికి సంయమనం అత్యవసరం. ప్రతి భిక్షువూ దృఢనిశ్చయమన్న దాగలిమీద శీలాన్ని మలిచి తీర్చిదిద్దుకోవలసి ఉంది.

ధమ్మపదం ఇలా చెబుతుంది.

"ప్రాణి హింసకుడనృతమ్ము పలుకువాడు
పరధన స్త్రీల కోసము వగచువాడు
తప్పుతాగినవాడు ఈ ధరణియందు
తాను తవ్విన గోతిలో తానె బడును"

బౌద్ధ ధర్మాన్ని స్వీకరించ దలుచుకున్న వారంతా ఈ కనీస ప్రవర్తనా నియమావళిని అనుసరించ వలసి ఉంటుంది.

సమ్యక్ జీవనమంటే జీవించడానికి సరైన వృత్తిని అవలంబించడం. అంటే ప్రాణికోటికి, హాని, బాధకలిగించే బానిసల వ్యాపారం, కసాయి వృత్తి, విషపదార్థాల వ్యాపారం లాంటి వాటిని జీవనోపాధికి సాధనాలుగా వాడుకోకూడదు. సమ్యక్ జీవన నియమం వ్యక్తికీ సమాజానికీ నిజమైన ఆనందం అందించడానికే విధించబడింది. అక్రమ జీవనోపాధి తగదన్న నిబంధన వ్యక్తులకూ, కుటుంబాలకే గాక జాతులక్కూడా వర్తిస్తుంది. అన్యాయకరమైన వృత్తులు, జీవనోపాధులు సమాజానికి అశాంతి, అనైక్యతలాంటి సమస్యలను సృష్టిస్తాయి. ఒక వ్యక్తి గానీ, వర్గంగానీ పరపీడనకు పాల్పడితే సామాజిక శాంతి సామరస్యాలకు భంగం కలుగుతుంది.

సమ్యక్ కృషి లేదా సమ్యక్ యత్నం అంటే మనసులో దురాలోచనలూ, దుర్భావనలు రేకెత్తకుండా నిరోధించడం. ఒకవేళ అవి తలెత్తితే వాటిని అణచివేయడం, మనసును ప్రక్షాళనం చేసి మంచి మార్గంలో పెట్టి మాలిన్య రహితంగా మార్చడం. అనగా మనసును సుశిక్షితం చేయడమే సమ్యక్ కృషి లక్ష్యం. చిత్తం ఏ అధికారానికీ లొంగదు. సాధకులు అప్రమత్తతతో సదాలోచనలను పెంపొందించుకుంటూ, దురాలోచనలను మొగ్గలోనే తుంచి వేస్తూ ఉండాలి.

దురాలోచనలనూ, అరిష్టదాయకమైన దుష్టభావాలనూ నిర్మూలించడానికీ, బహుజన హితమూ శ్రేయస్కరమూ అయిన ఆలోచనలను పటిష్ఠం చేయడానికీ సమ్యక్ కృషి సాధనంగా ఉపయోగపడుతుంది. వ్యవసాయదారుడు పొలంలో విత్తనం వేసేటప్పుడు మొదట కలుపు మొక్కలను నిర్మూలించినట్లు సాధకుడు తనమనో క్షేత్రం నుంచి అనారోగ్యకరమైన, అనర్థదాయకమైన ఆలోచనలను తొలగిస్తాడు. విత్తిన తర్వాత ఎరువులు వేసి నీరు పెట్టి లేత పైరు మొక్కలను పశుపక్ష్యాదుల నుంచి రక్షిస్తాడు. అలాగే సాధకుడు తన మనస్సులో మంచి ఆరోగ్యకరమైన భావాలను కాపాడి పెంచుకోవలసి ఉంది.

సమ్యక్ స్మృతి : శరీరాన్నీ, మనస్సునూ, పరిసరాలనూ నిశితంగా, జాగ్రత్తగా పరిశీలిస్తూ, గమనిస్తూ దురాశను, శోకాన్ని వదుల్చుకోవడమే సమ్యక్ స్మృతి. బౌద్ధ ధర్మంలో దీనికి అమిత ప్రాముఖ్యం ఉంది. తనను గురించి తాను

తెలుసుకోవడం ద్వారా, తనమీద తాను ఆధిపత్యం సాధించడమే సమ్యక్ స్మృతి. ఏకార్యాన్నీ అశ్రద్ధగా, అలక్ష్యంగా, అజాగ్రత్తగా, మొక్కుబడి తంతుగా చేయడానికి ఇది అనుమతించదు. మానవుని ఇచ్ఛాప్రేరిత కార్యకలాపాలను సమ్యక్ స్మృతి నియంత్రిస్తుంది. మనసును సుశిక్షితం చేయడం ద్వారా మానవ స్వభావాన్ని ప్రస్తుతం ఉన్న స్థితికి పూర్తి భిన్నంగా, మహోన్నతంగా మార్చడానికి అది దోహదం చేస్తుంది.

ఇది బౌద్ధ ధర్మంలో అత్యంత కీలకమైన అనాత్మ సిద్ధాంతానికి ప్రాతిపదిక. ఆత్మకు నాశనం లేదనీ, అది శాశ్వతమైనదనీ విశ్వసిస్తే ఆనంద సిద్ధికీ, ముక్తికీ దేహాన్ని శుష్కింప జేసుకొని, చిత్తచాంచల్యాన్ని, భావోద్రేకాలను నిగ్రహించి, ఆత్మను సాక్షాత్కరించు కోవడమే మార్గమని నమ్మవలసి వస్తుంది. ఇది పెద్ద పొరపాటని బుద్ధుడు భావించాడు. ఇదే నిజమైతే మానవ నైజాన్ని మార్చడం అసాధ్యం కాబట్టి ముక్తి సాధన కూడా అసంభవమే అవుతుంది. దుఃఖాన్ని నిర్మూలించే శక్తి మానవునిలో అంతర్గతంగా, స్వతస్సిద్ధంగా ఉందనుకోవడం పొరపాటు. దాన్ని మనం నిర్మించుకోవాలి. శరీరంలో ఆత్మ తప్పమరేమీ మిగలకుండా శుష్కింప జేయాలనడం సరైన మార్గం కాదు. అది పూర్తిగా నిష్ప్రయోజనకరం. మనిషి ఉన్నత చైతన్యంతో ఉత్తమ వ్యక్తిత్వాన్ని సాధించుకోవాలి. సంకల్ప బలంతో సాగించే కృషి ఫలితంగా ఉన్నత చైతన్య స్థాయి అందుకోవచ్చు.

ఈ చైతన్యస్థాయిలన్నిటి సమాహారమే ప్రజ్ఞ. ఈ సర్వోత్కృష్ట, నిరపేక్ష జ్ఞాన సిద్ధాంతాన్ని అన్ని బౌద్ధ ధార్మిక శాఖలు చాలా ప్రధానమైనదిగా పరిగణిస్తున్నాయి.

అష్టాంగ మార్గంలో అతి ముఖ్యమైంది సమ్యక్ సమాధి. సమాధికి మానసిక ఏకాగ్రత అత్యంత అవశ్యకమే అయినా కేవలం ఏకాగ్రతే, ధ్యానమే సమాధి కాదు. అది ఆ రెండింటికీ మించిన స్థితి, ఒక చోట ఆసీనులై శరీరాన్నీ, బుద్ధినీ చురుకుగా, సావధానంగా ఉంచుకున్న భిక్షువు కామం, క్రోధం, ఆలసత్వం, అసత్యం, అయోమయం లాంటి దుర్గుణాలను మనసులోంచి ప్రక్షాళనం చేస్తాడు. ఈ విధంగా అవగుణాల నుంచి ముక్తుడైన భిక్షువు హృదయంలో ఆనందం ఉద్భవిస్తుంది. అతడు నాలుగు ధ్యాన దశలను అధిగమిస్తాడు. మనశ్శరీరాలను స్వచ్ఛత, పవిత్రత ఆవరిస్తాయి. ఈ మనస్థితిలో చతురార్య సత్యాల పరమార్థాన్ని

పూర్తిగా అర్థం చేసుకుంటాడు. సుఖాపేక్ష, అస్తిత్వాపేక్ష, అవిద్య అనే మూడు మహా దోషాలు ఎలా ప్రారంభమవుతాయో, ఎలా అంతమవుతాయో గ్రహిస్తాడు. అప్పుడు ఆ భిక్షువుతన పూర్వ జన్మ పరంపరనే గాకుండా, ఇతరుల గత జన్మలను కూడా దర్శించి అర్థం చేసుకుంటాడు. అలా ముక్తుడయ్యాక అతనిలో ప్రజ్ఞ ఉదయిస్తుంది. తనకిక పునర్భవంలేదనీ, తాను ఉన్నత జీవితం గడిపాననీ, చేయవలసిందంటూ ఇక ఏమీ మిగల్లేదనీ అవగతమవుతుంది.

నిర్వాణం, అర్హత్వం : బౌద్ధ ధర్మ సార సంగ్రహం నిర్వాణం. అది జన్మ జరా రుజా మరణాలూ, దుఃఖమూలేని విశిష్ట, నిరుపమాన స్థితి. ఇది మరణానంతరం కాదు, ఈ జన్మలోనే పొందగల్గిన స్థితి. క్రియాశీలజీవితానికీ, దీనికీ మధ్య ఏవిధమైన వైరుధ్యమూ లేదు. ఇది ఆనందమయమైన ప్రశాంతస్థితి. ఈ స్థితిలో కామం, ద్వేషం, అజ్ఞానం, అంతరించి అఖండమైన పరమానందం ప్రాప్తిస్తుంది. ఈ స్థితిలో దుఃఖం సాంతం అంతరిస్తుంది. తన జీవితాన్ని సక్రమంగా నియంత్రించుకున్న మనిషి, క్షణికం, అనిత్యం అయిన దాన్ని అధిగమించి, సత్యమూ, అత్యున్నతమూ అయిన ఫలితాన్ని పొందుతాడు. అదే నిర్వాణం. ఆ నిర్వాణ పదాన్ని అధిరోహించిన మనిషికి ఇక పునర్జన్మ ఉండదు.

నిర్వాణ పదానికి చేర్చే మార్గమే పైన వివరించిన అష్టాంగమార్గం, ఈ మార్గంలోని ఎనిమిది అంతర్భాగాలను ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

| | |
|---|---|
| సమ్యక్ వాక్కు<br>సమ్యక్ కర్మ<br>సమ్యక్ జీవనం | శీలం |
| సమ్యక్ స్మృతి<br>సమ్యక్ సమాధి | సమాధి |
| సమ్యక్ దృష్టి<br>సమ్యక్ సంకల్పం<br>సమ్యక్ కృషి | ప్రజ్ఞ |

ఉపాసకుడు మొదట సమ్యక్ వాక్కునూ, సమ్యక్ కర్మలను ఆచరిస్తూ సమ్యక్ జీవనాన్ని అనుసరించి సచ్ఛీలాన్ని అలవర్చుకుంటాడు. ఆ తరువాత సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధుల ద్వారా అత్యున్నత చైతన్యస్థాయి నందుకొంటాడు. తదనంతరం సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ కృషి ద్వారా ప్రజ్ఞను సాధించి సకల వస్తువుల నిజస్వరూపాన్ని దర్శించగలిగి నిర్వాణపదం అందుకొంటాడు.

నిర్వాణం రెండు రకాలు : మొదటి ఉపాధి శేష నిర్వాణం, ఈ స్థితిలో సాధకుడు వాంఛా విముక్తుడై, సశరీరుడై ఉంటాడు. దీన్నే అర్హత్వమని కూడా అంటారు. అర్హతుడు పవిత్రుడు, సమ్మానార్హుడైన వ్యక్తి. అర్హత్వాన్ని పొందిన వ్యక్తి జీవించే ఉంటాడు. అతడు లక్ష్యాన్ని సాధించి ముక్తుడైనా సజీవంగా ఉంటూ ఇతరులకు ధర్మాన్ని బోధిస్తూ ఉంటాడు. లోకంలో ఉంటాడు కానీ దానికి చెందడు. అర్హతుని మరణంతో అనుపాధి శేష నిర్వాణం లభిస్తుంది. ఈ స్థితిలో స్కంధాలు మిగలవు. దీన్నే పరినిర్వణం అంటారు ఒక్క మాటలో చెప్పాలంటే ధార్మిక జీవన అత్యున్నత లక్ష్యం నిర్వాణం. నిర్వాణ పదాన్ని పొందిన సాధకుడు మరణ భయాతీతుడు.

బుద్ధుని ప్రబోధాలను ఇలా క్లుప్తీకరించవచ్చు. ప్రతి వస్తువు అస్తిత్వానికీ ఏదో ఒక కారణం ఉంటుంది. కాబట్టి దుఃఖానికి మూల కారణాన్ని తెలుసుకొని దాన్ని నిర్మూలిస్తే దుఃఖం నుంచి విముక్తి లభిస్తుంది. కామం, ఇంద్రియ సుఖాపేక్షలే దుఃఖానికి మూల కారణాలు. కర్మకాండలను, పూజలనూ బోధించే మతాలన్నీ వ్యాధితో సంబంధం లేని వైద్యాన్ని సూచిస్తున్నాయి. అందుచేత అవి పూర్తిగా నిష్ప్రయోజనమైనవి. హృదయాన్ని పరిశుద్ధం చేయడం ద్వారా, కారుణ్యాన్ని, సామాజిక విధులనూ, శీల నిర్మాణాన్ని నొక్కి వక్కాణించే నైతిక ధర్మాన్ని పాటించడం ద్వారా దుఃఖానికి గల మూలకారణాన్ని నిర్మూలించవచ్చు. మనిషి స్వభావంలో మార్పు తీసుకరావడం సాధ్యమని అంగీకరిస్తేనే వ్యక్తిత్వ పునర్నిర్మాణానికి అవకాశం ఉంటుంది. కాబట్టి మానవుని అంతస్సారమైన ఆత్మ ఎన్నటికీ మార్పుచెందదనీ, దాన్ని భౌతిక జీవన శృంఖలాల నుంచి విముక్తి చేస్తే చాలునని చెప్పడం ధార్మిక జీవితంలో పెద్ద పొరపాటు. మంచి ఆలోచనలూ, మంచి పనుల ద్వారానే ఆనందమయమైన మనస్సు రూపొందుతుంది. శాశ్వతమైన ఆత్మగానీ,

పదార్థం గానీ లేదన్న బుద్ధుని ప్రసిద్ధ బోధన కేవలం తాత్విక వాదోపవాదాల మీద, ఊహాపోహాల మీద ఆధారపడిన సిద్ధాంతం కాదు. ఈ ప్రపంచం అనిత్యం, అనిశ్చితం అంటూ భావావేశంతో ప్రకటించిన ఆవేదన కాదు. అది ధార్మికత్వానికీ, నైతికతకు ప్రాతిపదిక అయిన జీవన సత్యం. తన శీల స్వభావాలను తాను కోరుకున్నట్లు నిర్మించుకోగలనని గ్రహించని మనిషి ఆనందంగా ఉండడం అసంభవం.

ఇతర భారతీయ ధార్మిక సిద్ధాంతాల్లోని దైవభావన, దానికి చెందిన విశ్వాసాలు బుద్ధుని బోధనల్లో అగుపించవు. అదే భారతీయ ధార్మిక సంప్రదాయాల్లో బౌద్ధ ధర్మాని కొక ప్రత్యేకతను కల్పిస్తుంది. బుద్ధుని బోధనల సారం నిర్వాణం. నిర్వాణమంటే ఈ జన్మలోనే లభించే ఆనందమయ స్థితి, మరణానంతర స్థితిని గురించిన ప్రశ్నలకు సమాధానం ఇవ్వడానికి బుద్ధుడు ఎన్నోసార్లు నిరాకరించాడు. ఆ ప్రశ్న పూర్తిగా నిరుపయోగము, అసంబద్ధమూ అని ఆయన భావించాడు. దుఃఖమయమైన ప్రపంచంలో దుఃఖోపశమనమే ప్రధానం. తాత్విక ఊహాపోహాలు దుఃఖోపశమనానికి మార్గం కాదని బుద్ధుడు భావించాడు. మాలుంక్యపుత్త సూత్రంలో ఆయన ఇలా స్పష్టం చేశాడు. “ఒకానొక మనిషికి విషపూరితమైన బాణం తగిలి గాయపడ్డాడు. అతని స్నేహితులు గాయానికి కట్టుగట్టడానికి వైద్యుని పిల్చుకవచ్చారు. నన్ను గాయపరచిన వ్యక్తి కులం, వంశం, నివాస స్థానం, సామాజిక హోదా తదితర విషయాలు తెలిసినంతవరకూ కట్టుకట్టడానికి వీలు లేదనీ, గుచ్చుకున్న బాణం ఆకారం ఎలా వుంది, దానికున్న ఈకలు ఏ పక్షివి, వింటినారి, దబ్బ దేనికి సంబంధించినవి అన్న వివరాలు తెలిసేంత వరకు బాణాన్ని వెలికి లాగకూడదని భీష్మించుకుని కూర్చుంటే ఆ లోగా అతను మరణిస్తాడు. కాబట్టి ఆ ప్రశ్నలకు అతనికి సమాధానం తెలిసే అవకాశమే ఉండదు”. అలాగే మరణానంతరం అస్తిత్వం ఉందా? లేదా? ప్రపంచం అనంతమా? పరిమితమా? భౌతిక శరీరం, చైతన్యాల సంబంధం ఏమిటి? ఇలాంటి ప్రశ్నలకు నిర్దిష్టమైన సమాధానాలు లభించడం కష్టం. కాబట్టి వాటిమీద వాదోపవాదాలు నిష్ప్రయోజనకరమని బుద్ధుడు స్పష్టం చేశాడు. మరణానికి ముందే మానవుడు మరణ, పునర్జన్మల భయంలేని ఆనందమయ స్థితిని సాధించగలడని ఆయన బోధించాడు.

బుద్ధుడు వైదిక కర్మకాండలను, దానికి సంబంధించిన తాత్విక భావాలను కూడా ఖండించాడు. ఆయన తర్వాత ఆ కర్మకాండలు పూర్తిగా విలుప్తం కాకపోయినా మునుపటి ప్రాభవాన్ని పొందలేక పోయాయి. బుద్ధుడు తన కాలం నాటి తాత్విక భావనలను పూర్తిగా మార్చి, వాటికి ఇతఃపూర్వంలేని జవసత్వాలను, ప్రాముఖ్యాన్ని, ప్రాచుర్యాన్ని సమకూర్చాడు.

అమృతపద ద్వారాలు అందరికీ తెరిచే ఉంటాయనీ, ధర్మమూ, నైతికతా భిన్న విషయాలు కావనీ ఆయన చేసిన అత్యంత సరళమైన ఉద్ఘాటన వైదిక సిద్ధాంతాలనూ, కర్మకాండలను వెనక్కి నెట్టి ఆ స్థానంలో నైతిక ధర్మాన్ని ప్రతిష్ఠించింది.



ఆనంద బుద్ధ విహార ట్రస్టు
బౌద్ధ ధర్మానికి, సంస్కృతికి అంకితమైన ధర్మ సంస్థ



*నమో తస్స భగవతే అరహతో సమ్మా సంబుద్ధస్స*


**ఆనంద బుద్ధ విహార ట్రస్ట్**

సాయినగర్ : తుకారాంగేట్, నార్త్ లాలాగూడ,

సికింద్రాబాద్ - 500 017 ఎ.పి., ఇండియా.

